

# చందమామ



మీకు అత్యంత ఆప్తమైన
చందమామ
క్లాసిక్స్ అండ్ కామిక్స్
తెలుగులో కూడా వస్తూంది త్వరలో






















ప్రచురణతేది కోసం ఎదురుచూడండి

# చందమామ

ఏప్రిల్ 1982



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు


| | | | |
|---|---|---|---|
| అపార్థం | .... 6 | పృథ్వీరాజు-సంయుక్త-3 | .... 35 |
| మకరదేవత-6 | .... 11 | భార్యావిధేయుడు | .... 39 |
| నిత్యానందుడి పాపం | .... 19 | డొంక తిరుగుడు | .... 43 |
| నష్టపరిహారం | .... 25 | కాలకేతుడి గర్వం | .... 44 |
| పాపం విదూషకుడు | .... 27 | కోశాధికారి | .... 49 |
| మూఢనమ్మకాలు | .... 28 | విఘ్నేశ్వరుడు-16 | .... 51 |
| ధర్మాచరణ | .... 31 | గంధర్వచక్రవర్తి కూతురు-7 | 59 |




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

---

ఈ నెల బేతాళకథ [''నిత్యానందుడి పాపం'']కు ఆధారం ''వసుంధర'' రచన. మనిషి సంఘజీవి. అందువల్ల, శత్రుభావం కలవాళ్ళు పరస్పరం నష్టపరుచుకోవాలని చూసినప్పుడు, అది యితరులకు కూడా కీడుచేసి తీరుతుంది. ఈ వాస్తవం, ''నష్టపరిహారం'' అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

లలితాంతాని గీతాని, కువాక్యాంతం తు సౌహృదమ్,
ప్రణామాంతః సతాం క్రోధః, యాచనాంతం హి గౌరవమ్.

[పాట ఘనత చెవికి ఇంపుగా వున్నంతవరకే. కటువైన మాటలు పలకనంతవరకే స్నేహం. ఉత్తముల కోపం ఒక్క నమస్కారంతో పోతుంది. యాచించనంతవరకే మనిషికి గౌరవం.]

సంపుటి 70 ఏప్రిల్ '82 సంచిక 4

విడి ప్రతి : 1-75 : : సంవత్సర చందా : 21-00





# అపార్థం

తన తోటి ఉద్యోగి రవి పట్టుబట్టడంవల్ల, హేమను చూడడానికి వెళ్లాడు, సూర్యం. అతను హేమను గురించి విని వున్నాడు. ఆమెకు తల్లిదండ్రులు లేరు, అన్న వున్నాడు. కొద్దిగా చదువుకున్న హేమ ఇంటి పనులన్నీ చక్కగా చేయగలదు.

సూర్యం వెళ్ళిన రోజున హేమ అన్న పనిమీద పొరుగూరు వెళ్ళాడు. హేమ వదిన ఆమెను తీసుకువచ్చి, సూర్యం వాళ్ల ముందు కూర్చోబెట్టింది.

హేమ అందమైన పిల్ల. రవి కొంత సంభాషణ జరిగాక నవ్వుతూ, ''సూర్యం, ఏమంటావు? హేమను చేసుకునేవాడు చాలా అదృష్టవంతుడు. ఎటొచ్చీ కట్నం గిట్టుబాటు కాదనే లోపం తప్ప, అన్ని విధాలా యోగ్యురాలు,'' అన్నాడు.

''డబ్బుతో కొనలేనివి చాలా వున్నవి. డబ్బుపోసి కొన్న వాటివల్ల తప్పక సుఖ పడతామనే నమ్మకం కూడా లేదు. కనక, కట్నం ప్రసక్తి తేకు,'' అన్నాడు సూర్యం.

''అయితే, హేమ నీకు నచ్చినట్టే అన్నమాట! ఇప్పుడు హేమ తండ్రి వరదాచారిగారుంటే ఎంత సంతోషించే వాడో,'' అన్నాడు రవి.

వరదాచారి అన్న పేరు వింటూనే సూర్యం ఉలిక్కిపడి, ''వరదాచారిగారా! ఆయన ఏం చేసేవాడు? ఏ ఊరు?'' అని అడిగాడు.

''ఆయన గొప్ప వైద్యుడు. స్వగ్రామం రామాపురంలోనే కాక, ఆ చుట్టుపక్కల కూడా ఆయన పేరు తెలియని వారు లేరు,'' అన్నాడు రవి.

రవి మాట పూర్తిచేసే లోపల సూర్యం జేవురించిన ముఖంతో లేచి నిలబడి, ''ఈ మాట ముందే తెలిసుంటే, ఈ చాయలకూడా వచ్చి వుండేవాణ్ణి కాదు.

మాచిరాజు కామేశ్వరరావు

ఆ పాపాత్ముడి కూతుర్ని చూసినందుకు, ఏదో ఒక ప్రాయశ్చిత్తం చేసుకోవాలి," అంటూ చరచర బయిటికి వెళ్లిపోయాడు.

ఇది చూసి రవి నిర్ఘాంతపోయాడు. హేమ తెల్లబోయింది, ఆమె కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. రవి ఏం మాట్లాడాలో తెలియక, తల వంచుకుని బయటికి వచ్చి, సరాసరి సూర్యం ఇంటికి వెళ్ళాడు. సూర్యానికి ఇంకా కోపం తగ్గినట్టు లేదు.

రవి కొంచెంసేపు వూరుకుని, "సాధువూ, వైద్యుడుగా చాలా జాలిగుండె కలవాడని పేరు మోసిన వరదాచారి మీద, నీకంత కోపం ఎందుకు? నీ కాయన తెలుసా?" అని అడిగాడు.

"చెబుతాను. ఇంకేనాడూ, ఆ నీచుడి పేరు నా ముందు ఎత్తకు," అని సూర్యం యిలా చెప్పాడు:

సూర్యానికి, రామం అనే బాల్యమిత్రుడున్నాడు. సూర్యం పట్నంలో ఉద్యోగంలో చేరే రోజునే రామం పెళ్ళి జరిగింది. ఆ కారణంవల్ల సూర్యం ఆ పెళ్లికి వెళ్ళలేకపోయాడు. రామం ఉద్యోగరీత్యా రామాపురం అనే ఊళ్లో వుంటున్నాడు.

ఉద్యోగంలో చేరిన మూడు నెలలకు సూర్యానికి రెండు రోజులు సెలవులు కలిసి వచ్చాయి. అతడు స్నేహితుణ్ణి చూసేందుకు రామాపురం బయలు



దేరాడు. అతడా ఊరు చేరేసరికి చీకటి పడింది. రామం వుండే ఇల్లు తెలుసుకోవడం అతడికేం కష్టం కాలేదు.

సూర్యం తలుపు తట్టగానే రామం భార్య జానకివచ్చి తలుపు తీసింది. ఆమె చాలా దుఃఖంలో వున్నట్టు కనబడింది.

"నా పేరు సూర్యం. రామం స్నేహితుణ్ణి," అన్నాడు సూర్యం.

ఆమాట వింటూనే జానకి పైట చెంగుతో కళ్ళు ఒత్తుకుని, "అన్నయ్యా, సమయానికి వచ్చావు! మీ స్నేహితుడి ఆరోగ్యం ఏం బాగా లేదు," అన్నది.

రామం మంచం మీద స్పృహ లేకుండా పడుకుని వున్నాడు.



"మూడు రోజులుగా మూసిన కన్ను తెరవలేదు. నాకు చాలా భయంగా వున్నది," అన్నది జానకి.

సూర్యం, రామం నుదుటిమీద చెయ్యి వేసి చూసి, "భయపడకమ్మా! వైద్యుణ్ణి పిలుచుకు వస్తాను," అన్నాడు.

"ఈ ఊరికి వరదాచారి అనే అయన ఒక్కడే వైద్యుడు. రెండు గంటల క్రితం వచ్చి చూసి మందిచ్చి, పొరుగూరు వెళుతున్నట్టు చెప్పాడు. తిరిగి వచ్చేసరికి ఏవేళ అవుతుందో!" అన్నది జానకి.

సూర్యం స్పృహలేని రామానికి ఉప చారాలు చేస్తూ కూర్చున్నాడు. జానకి, సూర్యం వున్నాడన్న ధైర్యంతో ఒళ్ళు మరిచి నిద్రపోయింది. అర్ధరాత్రి కావస్తూండగా రామం పరిస్థితి మరింతగా దిగజారింది.

సూర్యం కంగారుగా జానకిని లేపి, "నేవెళ్ళి, ఆ వరదాచారిని తీసుకువస్తాను. నువ్వు, రామం దగ్గిర కూర్చో," అన్నాడు.

జానకి, వరదాచారి ఇంటి గుర్తులు సూర్యానికి ఒకటికి రెండు మార్లు చెప్పింది. అతడు, వేపచెట్టు ఎదురుగా వున్న వరదాచారి ఇంటిని గుర్తుపట్టి, నాలుగైదుసార్లు గట్టిగా తలుపుకొట్టాక, కొంచెం ఎడంగా వున్న కిటికీ రెక్కలు తెరుచుకున్నవి.

"మీరేనా వరదాచారిగారు? మా స్నేహితుడు రామం పరిస్థితి...." అని సూర్యం చెపుతున్నంతలో, "వరదాచారి గారు మా నాన్న! అర్ధరాత్రివేళ, యీ తలుపు బాదుళ్ళేమిటి?" అంటూ కిటికీ వెనక వున్న మనిషి గట్టిగా కోప్పడ్డాడు.

"రోగి ప్రమాదస్థితిలో వున్నాడని, మీ నాన్నగారికి చెప్పండి," అన్నాడు సూర్యం. కిటికీలోంచి బయటికి తొంగి చూస్తున్న అతను తలతిప్పి, "ఎవరో రామం అనే అతని ఒంట్లో బాగాలేదట, వెళ్తావా, నాన్నా!" అంటూ కేక పెట్టాడు.

"అడ్డమైన వాళ్ళూ అర్ధరాత్రి వచ్చి హడావిడి పెడతారు. నిద్ర చెడింది! నువ్వొచ్చి పడుకో! రోగి బతికుంటే

తెల్లవారి చూస్తాను,'' అంటూ లోపలి గదుల్లోంచి జవాబు వచ్చింది.

ఆ మరుక్షణం కిటికీ రెక్కలు చప్పున మూసుకున్నవి. సూర్యానికి ఒళ్ళు మండింది. అతను ఇంటికి తిరిగివచ్చి, జరిగింది జానకితో చెప్పి, ''ఆ వరదాచారిని వైద్యుడని పిలవడమే అవమానం, దుర్మార్గుడు! రామాన్ని వెంటనే పట్నం తీసుకుపోదాం. ఈ దగ్గిర్లో బాడుగబండివాడెవడైనా వున్నాడా?'' అని అడిగాడు.

జానకి పోయి పక్కవీధిలో ఎరిగున్న బాడుగబండివాణ్ణి పిలుచుకు వచ్చింది. ఇద్దరూ రామాన్ని భద్రంగా బండిలో పడుకోబెట్టారు. కాని, పట్నం వెళ్ళే దారిలోనే రామం పోయాడు.

సూర్యం నుంచి యీ జరిగినదంతా విన్న రవి, ''ఇదా సంగతి! అయితే, హేమ ఇంట నీ ప్రవర్తనకు నేనేం తప్పు పట్టను,'' అన్నాడు.

మర్నాడు సాయంత్రం సూర్యం ఇంట్లో వుండగా, వీధి తలుపు చప్పుడయింది. గుమ్మంలో నిలబడి వున్న హేమను చూసి నిర్ఘాంతపోయిన సూర్యం, ''నువ్వా! ఇక్కడికెందుకొచ్చినట్టు?'' అన్నాడు.

''పెళ్ళి చేసుకోమని అడగడానికి మాత్రం కాదు,'' అంటూ హేమ చొరవగా వచ్చి లోపల కూర్చున్నది.



ఆమె తనకేసి కోపంగా చూస్తున్న సూర్యంతో, ''రవి నాకు అంతా చెప్పాడు. తెల్లవారక ముందే పట్నం వెళ్ళిపోవడంతో, మీకు ఆ ఊళ్ళో జరిగిపోయిన ఘోరం తెలియదు. మా నాన్నగారి మీద మీరు చాలా పెద్ద అపవాదు వేశారు. అసలు జరిగింది యిది!'' అంటూ చెప్పసాగింది.

ఆ రాత్రి హేమ అన్న బంధువుల ఇంట పెళ్ళికి వెళ్ళాడు. తండ్రి వైద్యం పనిమీద పొరుగూరు వెళ్ళాడు. ఆమె వంట చేసి తండ్రికోసం ఎదురుచూస్తూ కూర్చున్నది.

వరదాచారి బాడుగ బండిలో తిరిగి వచ్చేసరికి అర్ధరాత్రి దాటింది. ఆయన వస్తూనే, ''అమ్మా, బండివాళ్ళిద్దరూ

అన్నదమ్ములట, ఆకలంటున్నారు! వండింది వాళ్ళకు పెట్టు. మనం మళ్ళీ వండుకోవచ్చు, అన్నాడు.

హేమ ముందుగదిలో విస్తళ్ళువేసి, బండివాళ్ళకు వడ్డన చేసింది. వాళ్ళు భోజనం చేసి, నూతిదగ్గిర చేతులు కడుక్కొని వస్తూనే, కత్తులు చూపి బెదిరించి, తండ్రీ కూతుళ్ళను మంచం కోళ్ళకు కట్టివేశారు. తరవాత వాళ్ళ నోళ్లల్లో గుడ్డలు కుక్కి, ఇంట్లో వున్న విలువైన వస్తువులన్నీ మూటకట్టుకోసాగారు.

ఇంతలో వరదాచారి పేరు పెట్టి పిలుస్తూ, తలుపు చప్పుడయింది. దొంగలిద్దరూ కంగారుపడి, కొద్ది సేపు గుసగుసలాడుకున్నారు. ఒకడు కిటికీ రెక్కలు తెరిచి, వచ్చినవాడు వరదాచారి నెరగడని గ్రహించి, ఆయన కొడుకులా నటించాడు.

రామం పరిస్థితి బాగాలేదన్న మాట విని వరదాచారి లేని బలం తెచ్చుకుని కట్లు విప్పుకుని లేవబోయాడు. దొంగలు ఆయన్ని కత్తులతో పొడిచి, దొంగిలించిన వస్తువులతో పారిపోయారు. అది చూసి హేమకు స్పృహ తప్పింది. తిరిగి ఆమెకు స్పృహ తెలిసేసరికి, తండ్రి అంత్యక్రియలకు సన్నాహాలు జరుగుతున్నవి.

అంతా వింటూ ఆశ్చర్యపోతున్న సూర్యంతో, హేమ, "మీ స్నేహితుడి కోసం ప్రాణత్యాగం చేసిన మా నాన్న, మీ దృష్టిలో దుర్మార్గుడు! మనం కన్నవీ, విన్నవీ అన్నీ నిజం అని నమ్మకూడదు. దొంగలు ఆ మర్నాడే పట్టుబడ్డారు, వాళ్ళిప్పుడు ఖైదీలో మగ్గుతున్నారు!" అన్నది.

వరదాచారి త్యాగానికి సూర్యం కళ్ళు చెమ్మగిల్లాయి. అతడు హేమతో, "నువు అన్నట్టు, మనం కన్నవీ, విన్నవీ అన్నీ నిజంకాదు. కాని, నేను నీ మెడలో తాళి కట్టడం అందరూ చూస్తారు. అందులో నిజం కానిదంటూ ఏమీ వుండదు," అన్నాడు.

ఆ మాటలకు హేమ తృప్తిగా నవ్వుకుని, సిగ్గుతో తలవంచుకున్నది.






## 6

[శివదత్తుడి సలహా ప్రకారం, సమరసేనుడు తానే స్వయంగా సేనానాయకత్వం స్వీకరించటానికి అంగీకరించాడు. సైన్యసమీకరణకు నరవాహనుణ్ణి పంపాడు. అతడు సైనికుల, ప్రజల చేతుల్లో దెబ్బలు తిని తిరిగివచ్చాడు. గత్యంతరంలేక, రాజప్రాసాద రక్షణకు మృగశాలాధిపతి, క్రూరమృగాలను బోనుల్లోంచి బయటకు వదిలాడు. తరవాత—]

సమరసేనుడు తనను ప్రశ్నించిన విధం, శివదత్తుడు చెప్పగా విని, మందరదేవుడు చిరునవ్వు నవ్వాడు.

''పట్టణ ప్రాకారాల కావల విడిసివున్న శత్రువులకూ, పట్టణంలో రెచ్చిపోయిన ప్రజలకూ కూడా, కావలసింది రాజు గద్దె దిగటం! తరవాత రాజ్యాధికారాన్ని ఎవరు వశం చేసుకున్నా ఫలితం ఒకటే గదా?'' అన్నాడు మందరదేవుడు.

''అవును,'' అంటూ తల వూపాడు శివదత్తుడు. ''అప్పట్లో సమరసేనుడికి యింత సూక్ష్మంగా ఆలోచించేందుకు సరి అయిన అవకాశం చిక్కలేదు. అంతా గందరగోళంగా వుంది. అందుకే నేను, ''అవును సమరసేనా, అదే ప్రస్తుత పరిస్థితిగా కనబడుతోంది! నన్నడిగితే రాజ్యాధికారాన్ని పరులపాలు చేయటంకంటె, రాజును పదవి నుండి తొలగించి,

యీ ప్రజల సహాయంతో శత్రువుల మద మణచటం ఉత్తమమంటాను," అన్నాను.

"అదే నేనూ అనుకుంటున్నది! చిత్ర సేనుడు వృద్ధుడు, వంశోద్ధారకుడు కూడా లేడు. ఆయన సింహాసనం పరిత్యజిం చేందుకు అంగీకరించగలడని భావిస్తాను. ఒకసారి ప్రజలు శాంతించిన తరవాత, అప్పుడు పట్టణ ప్రాకారాల వెనక వున్న శత్రువులను ఓడించటం ఏమంత కష్టం కాదు," అన్నాడు సమరసేనుడు.

మేం యిలా మాట్లాడుతున్నంతలో చిత్రసేనుడు అక్కడికి రానే వచ్చాడు. ఆయన రావటం చూసిన ప్రజలు, ఒక్క పెట్టున, "రాజు నశించాలి, రాజరికం నశించాలి!" అంటూ అరవసాగారు.

చిత్రసేనుడు సరాసరి మేం వున్న చోటుకు వస్తూనే, "సమరసేనా, కోట బురుజు మీద నిలబడి చూస్తే, బయట గుడారాలు వేసుకుని దాడి చేసేందుకు సర్వసన్నద్ధంగా వున్న వందలాది శత్రువులు కనిపించారు. ఇక పట్టణ ప్రజల క్రోధోద్రేకాలు నాకు తెలియనివి కావు. తన వినోదాల్లో, విందుల్లో మునిగిపోయి, ప్రజల బాగోగులను మరచిన రాజు సింహాసనార్హుడు కాదు. నేను ప్రజలు కోరిన విధంగా రాజ్యపరిత్యాగమే కాదు; ఇంతకాలంగా చేసిన దుష్పరిపాలనకు గాను అంతకన్న పెద్ద త్యాగమే చేయదలి చాను!" అంటూ మండపం మీదికి వచ్చాడు.



చిత్రసేన మహారాజు ఆ విధంగా మాట్లాడేసరికి, నేనూ, సమరసేనుడూ కూడా నిర్విణ్ణులమయాము. మా నోటి వెంట మాట వెలువడలేదు. చిత్రసేనుడు ప్రజల నుద్దేశించి చేతులు ఊపుతూ, ''కుండలినీ ద్వీప వాసులారా! మీ ఆగ్రహాన్నీ, న్యాయమైన మీ కోర్కెనూ కూడా నేను గుర్తించాను. నేను భోగలాలసుడనై, మీ ఇక్కట్టులను చాలాకాలంగా తెలుసుకోలేకపోయాను. అట్టి నన్ను కిరీటం త్యజించమని కోరటం ధర్మమే! నేను కిరీటాన్నే కాదు, అంతకన్న గొప్ప విలువైనదాన్నే త్యజించబోతున్నాను. మీరు మాత్రం, మీ నాయకుడైన సమరసేనుడి ఆజ్ఞలను శిరసావహించండి," అన్నాడు.

మరుక్షణంలోనే ప్రజల నుండి జయ జయ ధ్వానాలు మిన్ను ముట్టినై. ఆ వెంటనే చిత్రసేనుడు ఎత్తయిన మంటపం మీది నుంచి కిందికి దూకేశాడు! అంతా కన్ను మూసి తెరిచేంతలో జరిగిపోయింది.

నేనూ సమరసేనుడూ నివ్వెరపడి కిందకు చూశాం. చిత్రసేనుడు అప్పటికే ప్రాణాలు విడిచినట్టుంది, కదలా మెదలటం లేదు.

హఠాత్తుగా అంత ఎత్తునుంచి తమ మధ్యకు దూకిన ప్రాణి ఎవరో తెలియక, భయకంపితమైన క్రూరమృగాలన్నీ చెల్లా చెదరుగా పారిపోయినై. ప్రజలందరూ నిశ్చేష్టులయ్యారు.






"అంతా అయిపోయింది, సర్వం ముగిసినట్టే!" అంటూ సమరసేనుడు అక్కడవున్న స్తంభానికి వేలాడ పడ్డాడు. కళ్ళలో నీటిబుగ్గ కదుల్లాడింది.

నేను జనం కేసి చూశాను. అంతా నిశ్శబ్దం. హఠాత్తుగా జరిగిన యీ ఘోర సంఘటన వాళ్ళను స్తంభీభూతుల్ని చేసింది. సమరసేనుడు స్థాణువులా వుండిపోయాడు. నరవాహనుడిలో చలనం వున్నట్టు లేదు.

అంతలో అక్కడికి మృగశాలాధిపతి పరిగెత్తుకుంటూ వచ్చాడు. "మహా సేనానీ, యిప్పుడు.... యిప్పుడు...." అంటూ అతడేమో చెప్పబోయాడు.

నేను అతణ్ణి వారించి, దగ్గరకు పిలిచాను. "ఇక నీ మృగాలనన్నిటినీ వాటి వాటి బోనుల్లోకి వెళ్ళేట్టు చూడు. ఆ పని ఎంత తొందరగా జరిగితే అంత మంచిది. ఒకటి రెండు నిమిషాల్లో కోటద్వారం తెరిపించబోతున్నాను. ఈ లోపల మహారాజు భౌతిక కాయం, ప్రాంగణం నుంచి తొలగించి, సురక్షిత ప్రదేశంలో జాగ్రత్తగా భద్రపరుచు," అని ఆజ్ఞాపించాను.

సమరసేనుడు నా మాటలను ఆలకిస్తూనే వున్నాడు. కొంచెం ఎడంగా నిలబడి వున్న నరవాహనుడు, నా కేసి ఓ మారు ఓర చూపు చూసి, మంటపం మీదికి వెళ్ళాడు.

కొద్ది సేపట్లోనే క్రూరమృగాలు వాటి బోనుల్లోకి తరమబడినై. చిత్రసేనుడి భౌతిక కాయం ప్రాంగణం నుంచి తొలగించబడింది. నేనూ, సమరసేనుడూ ప్రాసాదపు మెట్లు దిగి, ద్వారం కేసి బయలుదేరాం.

మేము ద్వారాన్ని చేరేసరికి ప్రజల్లో కలకలం బయలు దేరింది. వారొక్కుమ్మడిగా చేసిన, "సమరసేనుడికీ, జై!" అన్న నినాదాలు భూనభోంతరాళాలను బ్రద్దలు చేసినై.

కోట గుమ్మం తెరవబడింది. సమరసేనుడు ఒకటి రెండడుగులు ముందుకు

వేసి, గొంతు సవరించుకొని, ''కుండలినీ ద్వీపవాసులారా!'' అని పెద్దగా సంబో ధించేసరికి, అంతా నిశ్శబ్దం. ''నేను జరిగిపోయినదాన్ని గురించి, ఇప్పుడు మాట్లాడదలచలేదు,'' అన్నాడు సమర సేనుడు. ''దేశం అరాజకం పాలయింది. ఆ మాట నిజం! దీనికి ఎవరు ఎంత వరకు బాధ్యులన్నది ప్రస్తుత విషయం కాదు. ఈనాడు రాజులేడు, కనక రాజభక్తి ప్రసక్తి కూడా లేదు. ఇక యిప్పటి పరిస్థి తుల్లో అవసరమైంది, ప్రతి పౌరుడిలో దేశభక్తీ, ఐక్యతాభావం!''

''కుండలినీ ద్వీపం వర్ధిల్లాలి!'' అని ప్రజలు ఏకకంఠంతో అరిచారు.

''పట్టణ ప్రాకారాల అవతల ప్రబలు లైన శత్రువులు పట్టణం మీద దాడి చేసేందుకు విడిసి వున్నారు. ముందు పట్టణరక్షణ, తరవాత దేశరక్షణ! ఆయుధం పట్టగలిగిన ప్రతి పౌరుడూ ముందుకు రావాలని కోరుతున్నాను!'' అన్నాడు సమరసేనుడు.

ప్రజల్లో కలకలం బయలుదేరింది. అందరూ ఒకేసారి ముందుకు తోసు కుంటూ రాసాగారు. ''నాకు కత్తి యివ్వండి; నాకు గండ్రగొడ్డలి యివ్వండి, నాకు బాణం అంబుల పొదీ....'' ఇవీ కేకలు.




సమరసేనుడు వెనుదిరిగి చూశాడు. సమీపంలోనే నిలబడి వున్న నరవాహనుడి మీద దృష్టి ప్రసరించింది. ''నరవాహనా! ఈసారి నీ పని సుకరం అనుకుంటాను. సైన్యాన్ని సమాయత్త పరచు!'' అంటూ వెనుదిరిగాడు సమరసేనుడు.

నేనూ, సమరసేనుడూ అక్కడ నుంచి కోట బురుజు మీదికి వెళ్ళాం. దూరంగా పుట్టగొడుగుల్లా శత్రువుల గుడారాలు అసంఖ్యాకంగా కనబడినై. చీమలబారుల్లా వున్న శత్రు సైనికులు, ఆ గుడారాల ముందు విన్యాసాలు చేస్తున్నారు.

''శివదత్తా, శత్రువులు యుద్ధతంత్రం, వ్యూహరచన తెలియని వట్టి మంద కాదు.

ఆ విన్యాసాలు చూస్తూంటే, వాళ్ళు సుశిక్షితులైన సైనికుల్లా కనబడుతున్నారు,'' అన్నాడు సమరసేనుడు.

సమరసేనుడు చెప్పిన దాంట్లో సత్యం లేకపోలేదు. బారులుతీరి యుద్ధవిన్యాసాలు చేస్తున్న శత్రుసైనికుల తీరు చూస్తే, వాళ్ళు సైనిక శిక్షణలేని అరాజక జనంలా తోచలేదు.

నేను కోటగోడ వెంటవున్న అగడ్తకేసి చూశాను. అందులో అంతగా నీరున్నట్టు కనబడలేదు. వెంటనే ఒక సైనికుడిని పిలిచి, అగడ్తకు నిండుగా నీరు వదల వలసిందని ఆజ్ఞాపించాను. అప్పుడు సమరసేనుడు నా కేసి తిరిగి, ''శివదత్తా, సేనా నాయకత్వం నేను వహించక తప్పదు. పోతే కోట రక్షణభారం నీమీద వదలదలిచాను. నీ అభిప్రాయం ఏమిటి?'' అన్నాడు.

నేను వెంటనే ఆ ప్రశ్నకు జవాబు చెప్పలేక పోయాను. కోట రక్షణభారం నేను వహించటం అంటే, శత్రువులమీద దాడికి బయలుదేర బోతున్న సైనికుల వెంట నేనుండే అవకాశం వుండదన్న మాట. అప్పుడు ఉపసేనానిగా, సమర సేనుడి వెంట నరవాహనుడు వెళ్లే అవకాశం కలుగుతుంది. ఈ చిక్కు నుంచి బయటపడటం ఎలా అని నేను ఆలో




చించేటంతలో నరవాహనుడు అక్కడికి రానే వచ్చాడు.

''మహాసేనానీ, రెండు వేల మంది సుశిక్షితులైన సైనికులను సమీకరించాను. ప్రజల్లో దృఢకాయుల్ని ఏరి ఒక నాలుగు వేల మంది వరకూ ఆయుధాలిచ్చాను. ఇక యిప్పుడు చేయవలసిందేమిటి?'' అని నరవాహనుడు ప్రశ్నించాడు.

సమరసేనుడు నాకేసి తిరిగి, ''పట్టణ రక్షణకు, రెండువేలమంది చాలునను కుంటాను?'' అన్నాడు. నేను తల వూపాను. ''సరే, యీ రక్షణ భారమంతా నీది. నేను రెండువేలమంది సైనికులతో, ఆయుధధారులైన రెండు వేలమంది

ప్రజలతో దాడి బయలుదేరబోతున్నాను. మేము బయటికి వెళ్ళగానే పట్టణ ద్వారాలు జాగ్రత్తగా మూయించవలసింది,'' అన్నాడు.

సైన్యమంతా పట్టణద్వారాల నుంచి బయటికి వెళ్ళిపోగానే, నా పాతికమంది అనుచరులతో నేను రక్షణ కార్యక్రమాలు పర్యవేక్షించసాగాను. ఆయుధాలు ధరించిన ప్రజల వాలకం చూస్తే వాళ్ళకు వాటిని ఎలా ఉపయోగించాలో తెలిసినట్టు కనబడలేదు.

క్రమ పద్ధతిలో వాళ్ళనందర్నీ ఒకచోట నిలబెట్టటం కూడా చాలా కష్టసాధ్యమైంది. పైగా, వాళ్ళలో వాళ్ళు గిల్లికజ్జాలు పెట్టుకుంటూ, చిన్న చిన్న గుంపులుగా తయారై తగాదా పడసాగారు.

నేను పట్టణ ద్వారాలు మూయించి, కోట బురుజు మీదికి వెళ్ళాను. సమరసేనుడి ముఖ్య సైనిక భాగం కోటనుంచి వెలువడగానే, శత్రు శిబిరాల్లో కొంత సంచలనం బయలుదేరింది. వాళ్ళు హడావిడిగా ఆయుధధారణ చేసి, బారులు తీరి యుద్ధసన్నద్ధమౌతున్నారు. అశ్వికులు పెద్దపెద్ద ఈటెలు ధరించి, కాల్బల సైనికులకు ముందుగా నిలబడ్డారు. కొందరు చిన్న చిన్న ముఠాలుగా ఏర్పడి, సమరసేనుడి సైనిక భాగానికి అన్ని వైపులా మెరుపు దాడి చేసేందుకు ముందుకురికారు.

రెండు ప్రధాన సేనల మధ్య యుద్ధం తటస్థపడి, ఫలితం అటో యిటో వెంటనే తెలిపోయే అవకాశంలేదని నేను గ్రహించాను. పది పన్నెండు మంది శత్రు అశ్వికులు ఒక్కుమ్మడిగా, సమరసేనుడి సైనికులపైబడి, చేతికి అందినంత మందిని చంపి, ఆ వెంటనే దూరంగా పారిపోతున్నారు. ఈ రకమైన మెరుపు దాడులను సమరసేనుడు ముందుగా వూహించి వుండడు. ఆయన తన సైనికబలాలను నిలువరించి, తన అశ్వికులను కూడా పదిమంది చొప్పున చిన్నచిన్న ముఠాలుగా సమీకరించాడు. —(ఇంకా వుంది)





# నిత్యానందుడి పాపం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని. బేతాళుడు, "రాజా, నువ్వు యితరులకు మేలు చేయడం ద్వారా, గొప్ప పుణ్యాత్ముడన్న కీర్తి గడించాలని, యింతగా తాపత్రయపడుతున్నావేమో అన్న అనుమానం కలుగుతున్నది. ఎంత పుణ్యాత్ముడికైనా దైవేచ్ఛ తెలుసుకోవడం సాధ్యపడదు! ఆ కారణంగా, తాము పుణ్య కార్యాలు చేస్తున్నామన్న గట్టి విశ్వాసంతో, అలాంటి వాళ్ళు కొన్ని పాపకృత్యాలు చేసే ప్రమాదం వున్నది. ఇందుకు ఉదాహరణగా నీకు నిత్యానందుడనే ఒక పరోపకారి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా 'ప్పసాగాడు:

## బేతాళ కథలు



నిత్యానందుడు చిన్నతనం నుంచీ పరోపకారపరాయణుడు. కష్టాలలో వున్న వారిని వెతుక్కుంటూ మరీవెళ్ళి సాయపడేవాడు. నలుగురికీ సాయపడడం కోసమే ఆయన వ్యాపారం చేసి డబ్బు సంపాదించేవాడు. తన దాన గుణానికి సంసార బంధం అడ్డవుతుందని, ఆయన వివాహం కూడా చేసుకోలేదు. దానానికి అర్హుడా కాదా అన్న సంగతి బాగా ఆలోచించి కాని, ఆయన ఎవరికీ దానం చేసేవాడు కాదు.

నిత్యానందుడి పొరుగున వున్న గ్రామంలో సుబ్బయ్య అనే వడ్డీవ్యాపారి వుండేవాడు. అతడి దగ్గిర అప్పులు తీసుకున్న వాళ్ళలో ఎక్కువమంది సర్వనాశనమై పోయారని జనం చెప్పుకునేవారు. అప్పులు వసూలు చెయ్యడంలో సుబ్బయ్య ధర్మాధర్మాలు ఆలోచించేవాడు కాదు.

కొంతకాలంపాటు సుబ్బయ్య వైభవంగానే జీవించాడు. తరవాత అతడికి చెడ్డ రోజులు ప్రారంభమయినై. ఒకరోజున దొంగలు అతడి యిల్లు దోచుకుపోవడమే కాక, పోతూ పోతూ యింటికి నిప్పంటించారు. సుబ్బయ్య అంటే ఊళ్లో ఎవరికీ గిట్టకపోవడంవల్ల, అతడికి ఎవరూ సాయం రాలేదు. ఈ విధంగా అంత ఆస్తిపరుడూ ఒక్కరోజులో బికారి అయిపోయాడు.

ఆ తరవాత సుబ్బయ్యకు ఎవరూ ఆశ్రయం యివ్వకపోగా, తగినశాస్తి జరిగిందని సంతోషించారు. దీనితో సుబ్బయ్యకు బుద్ధి వచ్చింది. ఇక, ఆ ఊళ్ళో వుండడానికి మొహం చెల్లక, భార్యాబిడ్డలను తీసుకుని మరొక ఊరు వెళ్ళిపోయాడు.

అక్కడ అతడూ, భార్యాబిడ్డలూ కష్టించి పనిచేసి డబ్బు సంపాదించసాగారు. తన దగ్గిర కొంత డబ్బు కూడితే, తిరిగి ఏదైనా వ్యాపారం ప్రారంభించాలని సుబ్బయ్య ఆలోచన. అయితే, అతడి

దురదృష్టంకొద్దీ, ఏనాడూ అతడి దగ్గిర డబ్బు నిలవ వుండేదికాదు. తిండిగింజల ధరలు పెరిగిపోవడమో, ఇంట్లో ఎవరి కైనా జబ్బు చేయడమో తరచూ జరుగు తూండేది.

ఏదో దుష్టగ్రహం తనను పట్టి పీడి స్తున్నదని సుబ్బయ్య బాధపడేవాడు.

ఒకనాడు ఆ ఊరుకు ఒక సాధువు వచ్చాడు. సుబ్బయ్య ఆయన దర్శనం చేసుకుని, తన బాధలు వివరంగా చెప్పు కున్నాడు.

''నువ్వు చాలాసార్లు పేదవాళ్ళ నోటి దగ్గిర అన్నం కాజేశావు. అందువల్ల, ఒకే సమయంలో వెయ్యి మంది పేదలకు అన్నదానం చెయ్యి. దానితో నీకు పాప పరిహారమైపోతుంది. ఆ తర్వాత బుద్ధిగా బతుకు,'' అన్నాడు సాధువు.

ఆ రోజు నుంచీ సుబ్బయ్య మరింత జాగ్రత్తగా డబ్బు కూడబెట్టసాగాడు. అయినా, అనుకోకుండా ఏదో ఒక అవాం తరం వచ్చిపడి డబ్బు ఖర్చయిపోతూం డేది. ఇక, తను చేసిన పాపాల నుంచి విముక్తిలేదని అతడు బాధపడుతూండగా, నిత్యానందుణ్ణి గురించి తెలిసింది.

సుబ్బయ్య వెంటనే భార్యాబిడ్డలతో నిత్యానందు డుండే ఊరుకు బయలు దేరాడు. ఊరి పొలిమేరల్లో అతడికి ఒక మనిషి ఎదురయ్యాడు. సుబ్బయ్య అతణ్ణి పలకరించి, నిత్యానందుణ్ణి గురించి అడిగాడు.





'' నిత్యానందుడు నీకు తప్పక సహాయ పడతాడు. అయితే, తక్షణం నీ సమస్య పరిష్కారం అయిపోయే ఉపాయం ఒకటి చెపుతాను, విను. నిత్యానందుడు మహా పుణ్యాత్ముడు. ఆయన ప్రతిరోజూ దేవాలయంలో అడుగు పెట్టగానే, ఎవరూ వెలిగించనవసరం లేకుండానే, దీపాలు వాటంతట అవే వెలుగుతాయి. ఆ మహానుభావుడికి పిలిచి భోజనం పెట్టావంటే, అదే వెయ్యమంది పేదవారికి అన్నదానం చేసిన ఫలితాన్నిస్తుంది!'' అన్నాడా మనిషి.

సుబ్బయ్య యీ మాటలకు చాలా సంతోషిస్తూ ఊళ్లోకి వెళ్ళి, నిత్యానందుణ్ణి కలుసుకుని, తను వచ్చిన పని చెప్పాడు.

'' నీకు సాయపడేందుకు నా కెలాంటి అభ్యంతరం లేదు. కాని, నే నొక్కణ్ణే భోజనం చేస్తే, అది వెయ్యిమంది తిన్న దానికి సమానం ఎలా అవుతుంది? నేను సామాన్య మానవుణ్ణి. ఇలాంటి మూఢ నమ్మకాలు పెట్టుకోకు,'' అన్నాడు నిత్యానందుడు.

"మీరు పుణ్యాత్ములనడానికి సూచనగా గుడిలో దీపాలు వాటంతటవే వెలుగుతున్నాయి. అలాగే, ఇందుకూ ఏదో ఒక నిదర్శనం కనబడక పోదు,'' అన్నాడు సుబ్బయ్య.

సుబ్బయ్య కుటుంబం ఆ ఊళ్ళో నాలుగు రోజులు కష్టపడి డబ్బు సంపాదించి, దానితో నిత్యానందుడికి ఘనమైన విందు భోజనం పెట్టారు. నిత్యానందుడి భోజనం అయాక ఒక విచిత్రం జరిగింది. సుబ్బయ్య భార్య ఆయన తిన్న విస్తరి తీసివేయగా, అక్కడ ఇంకొక విస్తరి వెలిసింది! అలా ఒకదాని తర్వాత ఒకటిగా మొత్తం వెయ్యి విస్తళ్ళు వచ్చాయి.

ఈ నిదర్శనం నిత్యానందుడికి కూడా ఆశ్చర్యం కలిగించింది. ఆయన తృప్తిగా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

సుబ్బయ్య కూడా, యీ నాటితో తన కష్టాలు గట్టెక్కినట్టే అనుకున్నాడు.

అయితే, ఆ రోజు సాయంత్రం మరో విచిత్రం జరిగింది. నిత్యానందుడు ఎప్పటిలాగే గుడికి వెళ్ళాడు. కాని, గుడిలో దీపాలు వాటంతటవి వెలగలేదు. ఈ సంగతి కూడా ఊరంతా ఆశ్చర్యంగా చెప్పుకున్నారు. నిత్యానందుడు చాలా కలవర పడ్డాడు. తనవల్ల ఏం పొరపాటు జరిగింది?

ఆరోజునుంచీ నిత్యానందుడి కారణంగా గుడిలో దీపాలు వెలగడం ఆగిపోయింది. నిత్యానందుడు తన పుణ్యాన్ని పోగొట్టు కున్నట్టు అంతా భావించారు. తను సుబ్బయ్యకు సాయపడినప్పటి నుంచీ యిలా జరుగుతున్నదని నిత్యానందుడు గ్రహించాడు.

ఆయన ఒకనాడు ఇంట్లో దేవుడి విగ్రహం ముందు కూర్చుని, "స్వామీ, నా వల్ల ఏం అపరాధం జరిగింది? ఇంత కాలంగా నేను మంచివాళ్ళకూ, చెడ్డ వాళ్ళకూ్కడా సాయపడుతూనే వున్నాను. సుబ్బయ్య విషయంలో నేను చేసిన తప్పేమిటి? అతడు కొంతకాలం పాపపు జీవితం గడిపి, యిప్పుడు తప్పు తెలుసు కున్నాడు. అతడికి సాయపడడం తప్పవుతుందా?" అని ప్రశ్నించాడు.




దేవుడి నుంచి ఎలాంటి జవాబూ రాలేదు. నిత్యానందుడు పట్టుదలగా విగ్రహం ముందే కూర్చుని, "నేను చేసిన తప్పేమిటో చెప్పేవరకూ అన్నపానాలు లేకుండా యిక్కడే కూర్చుంటాను!" అన్నాడు.

ఈ సంగతి విన్న ఊరి పెద్దలు సుబ్బయ్యను పిలిచి, ప్రశ్నించారు. సుబ్బయ్య జరిగినదంతా చెప్పాడు. ఆ రోజే వెయ్యి మంది పేదలకు అన్నదానం చెయ్యాలని ఊరి పెద్దలు నిశ్చయించారు. కాని, సుబ్బయ్య వాళ్ళతో, "ఇప్పుడు మీరు పేదలకు చేయాలనుకుంటున్న అన్నదానం ఖర్చులు నావి. ప్రస్తుతానికి పేదవాణ్ణి.

కానీ, కష్టపడి క్రమంగా ఆ బాకీ తప్పక తీర్చుకుంటాను. నన్ను కనికరించండి,'' అన్నాడు.

వాళ్ళు అందుకు ఒప్పుకున్నారు. వెయ్యి మంది పేదలకు అన్నదానం జరిగింది. ఆ సాయంత్రం నిత్యానందుడి కారణంగా గుడిలో దీపాలు మళ్ళీ వెలిగాయి. ఆ తర్వాత సుబ్బయ్య పరిస్థితి మెరుగైంది. అతడు నీతిగా, న్యాయంగా వ్యాపారం చేసుకుంటూ సుఖంగా బతికాడు.

బేతాళుడు యీ కథ చెప్పి, ''రాజా, అంత గొప్ప పుణ్యం, మహత్తులూగల నిత్యానందుడు, సుబ్బయ్య యింట చేసిన ఒక్క పూట భోజనంతో, వాటినన్నిటినీ పోగొట్టుకోవడం ఏ కారణం వల్ల జరిగింది? సుబ్బయ్య చేసిన పాపాలు అతడికి సంక్రమించడం వల్లనా? అలాకాక, యిందుకు మరే యితర కారణాలయినా వున్నవా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీతల బద్దలవుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఈ లోకంలో పుణ్యాత్ముల పుణ్యం ఎంత గొప్పదో ప్రజలు తెలుసుకునేందుకు, దేవుడు కొన్ని అద్భుత శక్తులు వారికి ప్రసాదిస్తాడు. అందువల్ల వారిని ఆదర్శంగా పెట్టుకుని, మరి కొందరు పుణ్యకార్యాలు చేసే అవకాశం వున్నది. నిత్యానందుడు సుబ్బయ్యకు సాయం చేయాలను కోవడంలో తప్పేమీ లేదు. కాని, కష్టపడి సంపాయించిన డబ్బుతో సుబ్బయ్య వెయ్యిమంది పేదలకు అన్నదానం చేయదలిచాడు. అయినా, నిత్యానందుడి కారణంగా వాళ్ళకు ఒక పూట భోజనం దొరికే అవకాశం పోయింది. ఆ పాపకారణం గానే అతడు గుడిలో అడుగు పెట్టగానే దీపాలు వెలగడం మానేశాయి. దానితో అతడికి తన తప్పేమిటో తెలిసివచ్చింది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






# నష్ట పరిహారం

తిమ్మాపురం అనే గ్రామంలో జ్ఞానయ్యా, యజ్ఞయ్యా అనే రైతులిద్దరుండే వాళ్ళు. జ్ఞానయ్యకు గ్రామానికి తూర్పు వైపునా, యజ్ఞయ్యకు పడమటివైపునా చిన్న మామిడి తోటలుండేవి. వాళ్ళిద్దరి మధ్యా ఎంతో కాలంగా శత్రుభావం వున్నది.

వేసవి కాలంలో మామిడి తోటలు మంచి కాపుమీద వుండగా, జ్ఞానయ్యకు ఒక దుర్బుద్ధి పుట్టింది. అతడు పట్నం పోయి ఒక కోతిని కొనితెచ్చి, రాత్రివేళ రహస్యంగా యజ్ఞయ్య మామిడితోటలో వదిలాడు. కోతి ఇష్టం వచ్చినట్టు చెట్లల్లో తిరుగుతూ, మామిడి కాయలు ధ్వంసం చేయసాగింది.

యజ్ఞయ్య కోతిని పట్టించాలని గ్రామంలో వున్న బోయవాడికి పది రూపాయిల డబ్బు ఆశ చూపాడు. వాడు వలలు వేసీ, బోనులు పెట్టీ కోతిని పట్టలేక, కావాలంటే బాణంతో కొట్టి చంపుతానన్నాడు.

"ఒరే, కోతిని చంపడం మహాపాపం! దీన్ని యిక్కడికి పంపకం చేసినవాడు జ్ఞానయ్య, సందేహం లేదు. నా తోట ఎలాగూ నాశనమై పోతున్నది. అతగాడి తోట వ్యవహారం చూస్తాను," అన్నాడు యజ్ఞయ్య కోపంగా.

ఆ మర్నాడే అతను పట్నం వెళ్ళి కోతినొకదాన్ని కొని తెచ్చి, తూర్పు వైపున వున్న జ్ఞానయ్య మామిడితోటలో వదిలాడు. కోతి తోటను సర్వనాశనం చేయ ప్రారంభించింది. జ్ఞానయ్య కోతిని పట్టించే ప్రయత్నాలు చేశాడు గాని, ఫలించలేదు.

ఒక వైపున విరగ కాసిన మామిడి తోటలు పాడై పోతూంటే, ఆ సంగతి పట్టించుకోవడం మాని జ్ఞానయ్యా, యజ్ఞయ్యా తాము ఎరిగిన వాళ్ళతో తమ

వల్లూరు బాబురావు

తమ కోతుల ప్రతాపం గురించి గొప్పలు చెప్పుకోవడం ప్రారంభించారు.

ఈ విధంగా జ్ఞానయ్యా, యజ్ఞయ్యల కోతుల సంగతి అందరికీ తెలిసిపోయింది.

అయితే, ఎవరూ ఊహించని విధంగా నాలుగైదు వారాల తరవాత ఒక పెద్ద ఉపద్రవం వచ్చి పడింది. జ్ఞానయ్య, యజ్ఞయ్యల తోటల్లోని మామిడికాయలను నేలపాలు చేసింతరవాత, కోతులు రెండూ కొంత దూరంలో వున్న యితర రైతుల తోటలమీదికి వెళ్లి పడినై. వాళ్ళు కూడా వాటిని పట్టుకోవాలని ప్రయత్నం చేసి, సాధ్యం కాక గ్రామ మునసబు దగ్గిరకు పోయి జ్ఞానయ్య, యజ్ఞయ్యల మీద ఫిర్యాదు చేశారు.

మునసబు వాళ్ళిద్దరినీ పిలిపించి, సంగతి చెప్పి, ''మీ యిద్దరి తగాదా కారణంగా గ్రామంలోని మామిడి తోటలన్నీ నాశనమై పోతున్నవి. మీ కోతుల వల్ల నష్టపోయిన రైతులకు, నష్టపరిహారం యిచ్చుకోవాలి,'' అన్నాడు.

జ్ఞానయ్య, యజ్ఞయ్యలు తాము ఎంత నష్టపడిందీ మునసబుకు చెప్పడమే కాక కోతులను పట్టుకునేందుకు తాము చేసిన ప్రయత్నాలను గురించి వివరించారు.

మునసబు వాళ్ళ మాటలకు అవునంటూ తల వూపి, ''ఈ గ్రామానికి వాటిని పనిగట్టుకు మరీ తెచ్చిన వాళ్ళు మీరు! అందువల్ల, వాటి కారణంగా నష్టపోయిన రైతులకు మీరు పరిహారం యిచ్చుకోవలసిందే. పోతే, ఆ కోతులను పట్టేందుకు మీరు పట్నం పోయి, వాటిని ఎవరి దగ్గిర కొన్నారో, వాళ్ళనే తీసుకురండి. దానికయ్యే డబ్బుఖర్చంతా మీదే. ఇదంతా ఒకటి, రెండు రోజుల్లో జరిగిపోవాలి. ఆలస్యం అయిందో, మీరు చెల్లించ వలసిన నష్టపరిహారం రెండింతలవుతుంది,'' అన్నాడు.

జ్ఞానయ్య, యజ్ఞయ్యలు మారుమాట్లాడకుండా, ఎంతో ఆప్తమిత్రుల్లాగా, కోతులను పట్టేవాళ్ళను తెచ్చేందుకు పట్నం కేసి బయలుదేరారు.



# పాపం విదూషకుడు!

ఒక రాజుగారి మంత్రి, ఏ కొత్త శాసనాన్నయినా అమలుపరచడానికి ముందు, దాన్ని ఆస్థాన విదూషకుడికి విధిగా యిచ్చి, అతడి చేత చదివించిన తరవాతే, ఆ శాసనవిషయం ప్రజలకు తెలియపరిచేవాడు.

ఇలా చాలా కాలం జరిగాక విదూషకుడికి గర్వం పెరిగింది. ఒక రోజు అతను ఉండబట్టలేక మంత్రితో, "మంత్రివర్యా! ఏ శాసనాన్నయినా అమలుపరచడానికి ముందు, దాన్ని నా చేత చదివించి అర్థవివరణ చెప్పించుకుంటున్నారు. దీన్నిబట్టి, మరెవరిలోనూ లేని ప్రతిభ నాలో వున్నట్టు మీరు అంగీకరించినట్టేకదా! మరి, ఆస్థానంలోనివాళ్ళు, నన్నింతగా గౌరవించరెందుకు?" అని అడిగాడు.

మంత్రి నవ్వి, "ఏ శాసనాన్నయినా ముందు నీ చేత చదివించి అర్థం చెప్పిస్తున్నది, నువ్వు గొప్ప ప్రతిభావంతుడవనికాదు. నీ కంటూ ఆ శాసనం అర్థమైతే, యిక రాజ్యంలో అది అర్థం కానివాడంటూ వుండడు," అన్నాడు.

మంత్రి తనను ఎంత వెర్రివెధవ కింద జమకట్టేశాడో అర్థం కావడంతో, పాపం విదూషకుడికి పట్టిన గర్వమంతా దిగజారిపోయింది. —ఎమ్. డి. సౌజన్య





# మూఢ నమ్మకాలు

రాజయ్య దంపతులు కన్న సంతానంలో రాగిణి ఒక్కతే ఆడపిల్ల కావడంతో, వాళ్ళామెను ఎంతో మురిపెంగా పెంచారు. వాళ్ళకు తమ కూతురు గొప్ప అదృష్టవంతురాలన్న నమ్మకం వుండేది. ఆ కారణంగా, సందర్భపడినప్పుడల్లా ఆమెతో, ''అమ్మా, నువ్వు చాలా అదృష్టవంతురాలివే! నువ్వు ఏ ఇంట అడుగు పెడితే, ఆ ఇంట శుభాలు జరుగుతాయి,'' అనేవాళ్ళు.

క్రమంగా రాగిణికి తల్లిదండ్రుల మాటల్లో నమ్మకం కుదిరిపోయింది. ఆమె యితరులతో మాట్లాడేటప్పుడు, తాను గొప్ప అదృష్టవంతురాలిననే ధీమా కనబరిచేది.

కొంతకాలం తరవాత ఆమెకు సుందరం అనే అతడితో వివాహం జరిగింది. సుందరానికి పట్నంలో ఉద్యోగం.

రాగిణి అత్తవారింటికి వచ్చిన కొద్ది రోజులకే సుందరానికి ఉద్యోగంలో హోదా పెరిగింది. అతను ఇంటికి వస్తూనే ఆ సంగతి భార్యకు చెప్పి, ''హోదాతో పాటు జీతం కూడా పెరుగుతుంది గదా? మనం మునుపటి కన్న మరి కాస్త కుదురుగా, సుఖంగా బతకవచ్చు,'' అన్నాడు.

రాగిణి చిరునవ్వు నవ్వుతూ, ''అంతా బాగానే వున్నది. మీ హోదా పెరగడానికి నేను కారణం అన్న సంగతి మీకు తెలిసినట్టు లేదు,'' అన్నది.

సుందరం ఆశ్చర్యపోతూ, ''నా హోదా పెరగడానికి, ఇంటిపట్టున వుండే నువ్వెలా కారణం అవుతావు?'' అన్నాడు.

''కొందరు పుట్టు దురదృష్టవంతులున్నట్టే, మరి కొందరు పుట్టు అదృష్టవంతులుంటారు. నేను ఆ రెండో కోవకు

శరత్

చెందినదాన్ని. నేను ఏ ఇంట అడుగు పెడితే, ఆ ఇంట శుభాలు జరుగుతాయి. తెలిసిందా మీ హోదా పెరగడానికి మూల కారణం ఏమిటో?'' అన్నది రాగిణి.

''చాల్లే, యింతటితో యీ చాదస్తపు వాగుడు కట్టి పెట్టు. నువు, నా ఇంట కాలు పెట్టిన కారణంగా, నా హోదా పెరగలేదు. నేనింతవరకూ చేస్తున్న ఉద్యోగాన్ని క్రమశిక్షణతో, బాధ్యతా యుతంగా చేయడంవల్ల, పై అధికారుల దృష్టిలోకి వెళ్ళగలిగాను. వాళ్ళు నన్నొక మెట్టు ఎక్కించారు,'' అన్నాడు సుందరం.

''అయితే, ఆ క్రమశిక్షణా, బాధ్యతల్నీ యింతకాలంగా గుర్తించని పై ఉద్యోగులు, నేనీ యింట అడుగుపెట్టాకే గుర్తించారన్న మాట! దాని అర్థం ఏమిటి?'' అన్నది రాగిణి.

ఇక భార్యతో వాదించి లాభం లేదని సుందరం పూరుకున్నాడు.

ఈ గొడవ జరిగిన రోజున ఒక అర్ధ రాత్రి వేళ, పక్క గదిలో పడుకున్న సుందరం తల్లి పెద్దగా గొంతెత్తి, ''ఒరే, నాయనా! మంచం కింద నా నగలూ, చీరలూ వున్న పెట్టె ఎవడో దొంగ ఎత్తుకు పోయాడు. ఇదిగో చూడు, గోడలో ఎంత కన్నం వేశాడో,'' అంటూ శోకాలు ప్రారంభించింది.

సుందరం, భార్యతోపాటు గబగబా తల్లి వున్న గదిలోకి వచ్చి, తల్లిని



ఓదార్చుతూ, "జరిగిందేదో జరిగింది. ఇప్పుడు శోకాలు పెట్టి ప్రయోజనం ఏమిటి? ఊరుకో," అన్నాడు.

సుందరం తల్లి, రాగిణి కేసి కొరకొర చూస్తూ, "నువ్వేం నన్ను ఊరడించనవసరం లేదు. ఏ నాడైనా యిలాంటి దొంగతనం ఎరుగుదుమా? నీ పెళ్ళాం యీ ఇంట కాలు పెట్టిన ఘడియ అలాటిది!" అన్నది.

"అమ్మా, మధ్యలో దాన్ని ఆడిపోస్తావెందుకు? ఈ దొంగతనానికీ, అది కాపరానికి రావడానికీ మధ్య వున్న సంబంధం ఏమిటి?" అన్నాడు సుందరం కోపంగా.

సుందరం తల్లి కళ్ళు తుడుచుకుంటూ, "ఒక్కొక్క మనిషి అడుగులో దురదృష్ట దేవత తాండవిస్తుందిరా, నాయనా!" అన్నది.

అత్తగారు యిలా అనగానే రాగిణి ముంచుకొస్తున్న దుఃఖంతో, గబగబా పెరటి తలుపు తెరుచుకుని, బావి కేసి పరిగెత్తబోయింది.

సుందరం ఆమెను పట్టుకుని, "నీకేమన్నా పిచ్చెత్తిందా? ఏమిటీ, నువ్వు చేయబోతున్న పని?" అన్నాడు కోపంగా.

"మీ అమ్మగారు అంత మాట అన్నాక, బతికి ఏం లాభం?" అన్నది రాగిణి.

సుందరం భార్యను ఇంట్లోకి తీసుకువస్తూ, "మా అమ్మ మాటలు పట్టించుకోకు. నా ఉద్యోగం హెూదా నీ రాకవల్ల పెరిగిందని నువ్వనుకున్నట్టే, ఆమె నువ్వు అత్తింట అడుగు పెట్టగానే దొంగతనాల్లాంటి ఈతిబాధలు మొదలయ్యాయనుకుంటున్నది. మూఢ నమ్మకాల్లో, మీ యిద్దరూ ఒకరికొకరు ఏ మాత్రం తీసిపోరు," అన్నాడు.

"అత్తయ్య మాటలు కటువుగా వున్నా, నా కళ్ళు తెరిపించినై. మీరన్నది నిజం! నా మూఢ నమ్మకాలతో, అదృష్టవంతురాలిననే గర్వంతో, యీనాటి వరకూ చాలామందికి బాధ కలిగించాను. నాకు బుద్ధి వచ్చింది," అంటూ చీరకొంగుతో కళ్ళు తుడుచుకున్నది రాగిణి.





# ధర్మాచరణ

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు ఇంద్రప్రస్థ నగరంలో ధనంజయుడనే కురురాజుగా జన్మించాడు. ఆయన పరిపాలనలో అతివృష్టి, అనావృష్టి మొదలైన పీడలేవీ లేకుండా ప్రజలు సుఖపడుతూ వచ్చారు.

ధర్మాన్ని పాటించటంలోనూ, దానధర్మాలు చేయటంలోనూ, ధనంజయుడికి సాటి ఎవరూ లేరన్న ఖ్యాతి జంబూద్వీపమంతటా పాకింది.

ఆ కాలంలోనే కళింగదేశానికి రాజధాని అయిన దంతపురమనే నగరాన్ని కాళింగుడనే పేరుగల రాజు పరిపాలిస్తూండేవాడు. ఆ రాజ్యంలో ఒక ఏడు వానలు కురవక, కరువేర్పడింది. ప్రజలు తిండికి లేక అల్లాడారు. అనేకమంది శిశువులు తల్లుల చేతుల్లోనే మరణించారు. జనంలో భీభత్సం చెలరేగింది.

ఈ దుస్థితి చూసి కాళింగుడు తన మంత్రులతో ఆలోచన జరిపాడు. "ఈ యేడు మనదేశంలో ఇంత క్షామం ఏర్పడటానికేమి కారణం? ఈ పీడ తొలగించడానికి మనం చేయవలసిన పని ఏమిటి?" అన్నాడు రాజు.

"మహారాజా! ధర్మానికి హాని జరిగినప్పుడే ఇలాంటి ఉపద్రవాలు సంభవిస్తాయి. ఇంద్రప్రస్థం ఏలే ధనంజయుడు తన ధర్మాన్ని ఎంతో శ్రద్ధగా పాటిస్తాడు. అందుచేతనే ఆ దేశంలో నియమం తప్పకుండా నెలకు మూడు వానలు కురుస్తాయి. దేశం కరువు కాటకాలు ఎరగకుండా సుభిక్షంగా వుంటుంది," అన్నారు మంత్రులు.

"అలా అయితే మీరు వెంటనే బయలుదేరి ఇంద్రప్రస్థం వెళ్ళండి. ఆ ధనంజయ రాజు దర్శనం చేసుకుని, ఆయన చేత

జాతక కథ



బంగారు రేకులమీద ధర్మాలన్నీ రాయించుకురండి. వాటిని మనం కూడా అమలు చేసి దేశంలో అరిష్టాలు లేకుండా చేసుకుందాం!'' అన్నాడు కాళింగుడు.

ఆ ప్రకారమే కళింగ మంత్రులు కొన్ని బంగారు రేకులు తీసుకుని ఇంద్రప్రస్థానికి ప్రయాణమై వెళ్ళి, ధనంజయుడి దర్శనం చేసుకుని, ఆయనతో ఈ విధంగా అన్నారు :

''మహారాజా, మేము కళింగ దేశం నుంచి వస్తున్నాము. మా దేశప్రజలు భయంకరమైన క్షామంతో బాధపడ్తున్నారు. మీరు ధర్మస్వరూపులుగా ఉండి, ధర్మం తప్పకుండా ప్రజలను పరిపాలిస్తుండటం చేత, మీ ప్రజలు ఈతి బాధలెరగక, సుఖంగా ఉంటున్నారు. మా రాజు పాటించవలసిన ధర్మాలేవో మీరు ఈ బంగారు పత్రాలపై లిఖించి యిచ్చినట్టయితే, వాటిని పట్టుకుని తిరిగి వెళ్ళిపోతాము. మా రాజుగారు వాటిని అమలు జరిపి, ప్రజలను పీడించే కరువును పోగొట్టగలుగుతారు!''

ఇలా చెపుతూ కళింగ మంత్రులు బంగారు రేకులను ధనంజయుడి ముందు పెట్టారు.

ధనంజయుడు నమస్కారం చేసి ఇలా అన్నాడు: ''మహామంత్రులారా, క్షమించండి! నేను ఈ పత్రాలపై ధర్మాన్ని లిఖించడానికి తగిన వాణ్ణి కాను. ఎందుచేతనంటే ఒకప్పుడు నా వల్లనే అధర్మం జరిగింది. మా దేశంలో మూడేళ్ళ కొకసారి కార్తికోత్సవం జరుగుతుంది. అప్పుడు రాజు ఒక చెరువుగట్టున యజ్ఞం చేసి, నాలుగు దిక్కులా నాలుగు బాణాలు వదలాలి. ఒకసారి నేను వదిలిన బాణాలలో మూడు దొరికాయి, కాని నాలుగవది చెరువులో పడిపోయింది. అది చెరువులో పడినప్పుడు దాని విసురుకు చేపలూ, కప్పపిల్లలూ చచ్చిపోయి ఉంటాయి. ఆ విధంగా నేను ధర్మం తప్పాను. మరి మా రాజ్యంలో అరిష్టాలు లేవంటే దానికి

కారకులు పరిపాలక వర్గంలో ఇంకెవరైనా అయివుండవచ్చు. విచారించి చూడండి.''

ఈ మాటలు విని మంత్రులు ఆశ్చర్య పడ్డారు. వారు రాజమాత అయిన మాయా దేవి వద్దకు వెళ్ళి, ''తమరైనా మాకు ధర్మాలు రాసి పెట్టండి!'' అని కోరారు.

''అయ్యో, నాయనా! నేనూ ధర్మం తప్పినదాన్నే. ఒకసారి నా పెద్ద కుమారుడు నాకు సువర్ణహార మొకటి కానుక ఇచ్చాడు. నా పెద్ద కోడలు ఐశ్వర్యవంతురాలనే ఉద్దేశంతో నేనా హారాన్ని తీసుకుపోయి చిన్న కోడలికిచ్చాను. కాని ఇచ్చిన మరుక్షణం నాలో కలిగిన భేదబుద్ధి నా కర్థమై బాధ కలిగింది. అందుచేత ఒకరికి ధర్మాలు రాసి యిచ్చే అర్హత నాకు లేదు. మరెవరినైనా అడిగి చూడండి,'' అన్నది రాజమాత.



కళింగ మంత్రులు రాజభ్రాత అయిన నందుడి వద్దకు వెళ్ళారు. అతను తాను కూడా ఒకసారి ధర్మం తప్పినట్లు చెప్పాడు.

''నేను ప్రతి సాయంకాలమూ రాజాంతఃపురానికి రథంలో వెళతాను. ఒక్కొ రాత్రి అక్కడే వుండిపోతాను కూడా. నేను కొరడా రథంలో వుంచి వెళితే, రాత్రికి ఉండనన్న మాట. అప్పుడు సారథి నా కోసం వేచిఉంటాడు. కొరడా తీసుకుని వెళ్ళానంటే సారథి రథం తోలుకుపోయి, మర్నాడు ఉదయం తిరిగి తెస్తాడు. ఒక రోజు కొరడా రథంలోనే వదిలి రాజాంతఃపురం ప్రవేశించాను, తిరిగి వద్దామనే నా ఉద్దేశం. అయితే ఇంతలో వాన ప్రారంభమయింది. రాజుగారైన మా అన్నగారు నన్ను వెళ్ళనివ్వలేదు. ఆ రాత్రి అక్కడే వుండిపోయాను. వానకు తడుస్తూ నా సారథి కూడా రథంలోనే ఉండిపోయాడు. అతన్ని ఆ విధంగా ఇబ్బంది పెట్టి నేను ధర్మాన్ని తప్పాను,'' అన్నాడతను.

కనీసం రాజపురోహితుడైనా తమ కోరిక నెరవేర్చుతాడని కళింగమంత్రులు ఆయన

వద్దకు వెళ్ళారు. కాని ఆయన కూడా ధర్మం తప్పినట్టు చెపుతూ, ఇలా అన్నాడు:

"ఒక రోజు నేను రాజభవనానికి పోతుంటే దారిలో ఒక రథం కనిపించింది. దానికి బంగారు తొడగువున్నది. అది చూడగానే నాకు లోభం కలిగి, రాజుగారు దాన్ని నాకు దానం చేస్తే బాగుండుననిపించింది. నేను తీరా వెళ్ళే సరికి రాజుగారు నన్ను చూసి, 'ఈ రథం మీరు తీసుకోండి,' అన్నాడు. వెంటనే నా లోభం జ్ఞప్తికి వచ్చి, పశ్చాత్తాపం కలిగి రథాన్ని వద్దన్నాను. నేను మీకు ధర్మాలు రాసిపెట్టగలవాణ్ణి కాను!"

కళింగ మంత్రులకేమీ పాలుపోలేదు. వారు చివరి ఆశ మంత్రిమీద పెట్టుకుని ఆయన వద్దకు వెళ్ళారు. కాని ఆయన కూడా వారికి ఆశాభంగం కలిగించాడు.

"ఒకనాడు నేను ఒక రైతు తాలూకు పొలం కొలతలు వేయబోయాను. కొలత ప్రకారం కర్ర పాతవలసిన చోట చిన్న బిలం ఉన్నది. అందులో ఏ ప్రాణి అయినా వుండవచ్చునని అనుమానం వేసింది. కాని కర్ర కొంచెం ఇవతల పాతితే రైతుకు నష్టం, అవతలికి పాతితే రాజుకు నష్టం. అందుచేత ఆ బిలంలోనే కర్ర పాతమని ఆజ్ఞాపించాను. అదే సమయానికి ఎండ్రకాయ ఒకటి బిలంలో నుంచి బయటికి వస్తూ కర్రపోటుకు చచ్చిపోయింది. అందుచేత నేను కూడా ధర్మం తప్పినవాణ్ణే. కనక, నా ఎక్కువ ఏమీ లేదు."

కళింగ మంత్రులకు ఒక ఆలోచన తట్టింది. వారు తాము విన్న కథలన్నీ బంగారు రేకులపై రాసి, వాటిని తీసుకు పోయి తమ రాజుకు వినిపించారు. ధర్మం పట్ల శ్రద్ధగా ఉండటమే ఉత్తమ ధర్మమని కాళింగుడు తెలుసుకుని, ఆత్మ విమర్శనతో పరిపాలన సాగించాడు. వెంటనే వానలు కురిసి క్షామం తొలగిపోయింది. కళింగ ప్రజలు సుఖంగా జీవించారు.






# పృథ్వీరాజు – సంయుక్త-3

పృథ్వీరాజు మిత్రుడూ, ఆస్థాన కవీ అయిన చాంద్, తన యజమానిని కలుసుకున్నాడు. వారిద్దరూ మారు వేషాల్లో కనోజ్‌కు వచ్చారు. జయ చంద్రుడి అశ్వికులు, వాళ్ళను పట్టు కునే ప్రయత్నంలో విఫలులయారు.

కనోజ్ రాజ్య సరిహద్దుల్లో మెరికల వంటి పృథ్వీరాజు సైనికులు కొందరు దాగి వున్నారు. పృథ్వీరాజూ, సంయుక్తా సరిహద్దు దాటగానే వాళ్లు బయటికి వచ్చి, జయచంద్రుడి అశ్వికులను ఎదు ర్కొని, తరిమికొట్టారు.





జయచంద్రుడు ఈ సంఘటన తన ఆత్మగౌరవానికి భంగకరంగా భావించి, చాలా కుంగిపోయాడు. రాత్రింబవళ్ళు పృథ్వీరాజుపై పగ సాధించడం గురించి ఆలోచించసాగాడు. అతడు ఎంత బతి మాలినా, యితర రాజపుత్రులు పృథ్వీ రాజుపై యుద్ధానికి ఒప్పలేదు.



ఈ దశలో జయచంద్రుడికి వినాశకరమైన దుర్బుద్ధి పుట్టింది. ఢిల్లీ మీద దాడి చేయదలిస్తే, అందుకు తాను సాయపడగలనని అతడు గోరీ మహమ్మద్‌కు తెలియపరిచాడు. మహమ్మద్ పరమానందం చెందాడు. అతడికి, జయచంద్రుడి సాయంతో ఢిల్లీని జయించాలన్న ఆశ కలిగింది.

ఢిల్లీలో పృథ్వీరాజు, సంయుక్త కోసం ఒక నూతన భవనం కట్టించాడు. ఇద్దరికీ కాలం సుఖంగా గడిచిపోతున్నది. యుద్ధభయం లేకపోవడంతో పృథ్వీరాజు ప్రజాసంక్షేమ కార్యాలు ప్రారంభించాడు.





అతడు ఊహించని విధంగా గోరీ మహమ్మద్, జయచంద్రుడి సైన్యాలు ఢిల్లీ మీద దాడికి బయలుదేరినై. సైనికులు దారిలో వున్న గ్రామాలు తగలబెట్టసాగారు. సరిహద్దుల్లో వున్న కొద్దిమంది రక్షణ సైనికులతోపాటు, ప్రజలు కూడా యీ పరిణామానికి ఆశ్చర్యపోయారు.

సరిహద్దు సైనికులు ఢిల్లీ చేరి, పృథ్వీ రాజుకు శత్రువుల రాకను గురించి చెప్పారు. ఆయన అప్పటికప్పుడే తన సైన్యాన్ని యుద్ధసన్నద్ధం చేశాడు.





సంయుక్త స్వయంగా పృథ్వీరాజు తలపై శిరస్త్రాణాన్ని అలంకరించింది. ఆయన ఆమెకు వీడ్కోలు చెప్పి, శత్రువులను ఎదుర్కొనేందుకు బయలుదేరాడు. ఈ లోపల శత్రువులు నగర శివార్లను చేరారు.

శత్రువు అంత త్వరలో నగరాన్ని సమీపించగలడని ఎవరూ అనుకోలేదు. పృథ్వీరాజు సైనికులను ఉత్సాహపరిచి, శతుసైన్యాన్ని ఎదుర్కొన్నాడు.





పృధ్వీరాజు సైనికులు ఎంతో ధైర్య సాహసాలతో పోరాడారు. కాని, జయచంద్ర, గోరీ మహమ్మదుల ఐక్య సైనిక సంఖ్య వారికన్న ఎన్నో రెట్లు అధికం. పృధ్వీరాజు యుద్ధంలో గాయపడి మరణించాడు.

ఈ దుర్వార్త కొద్దిసేపట్లోనే సంయుక్తకు చేరింది. ఆమె ఆత్మత్యాగంకోసం అగ్నికుండం తయారు చేయించి, పృధ్వీరాజు చిత్రపటానికి పూలమాలవేసి, అగ్నిప్రవేశం చేసింది.





పృధ్వీరాజు మరణంతో ఢిల్లీలో హిందూ పరిపాలన అంతరించింది. తను సాధించిన విజయానికి గర్వపడే అవకాశం జయచంద్రుడికి ఎంతో కాలం దక్కలేదు. ఆ మరుసటి సంవత్సరం దురాశాపరుడైన గోరీ మహమ్మద్ కనోజ్ నగరం మీద దాడిచేశాడు. అతడి సేనానాయకుడైన కుతుబ్దీన్ నిర్దాక్షిణ్యంగా జయచంద్రుణ్ణి చంపాడు.



# భార్యా విధేయుడు

భీమరాజు భార్యావిధేయుడు. భార్యకు చెప్పకుండా ఏ పనీ చెయ్యడు. ఏ నాడూ ఆమె మాటకు ఎదురుచెప్పి ఎరగడు. మొదట్లో, అతడు ఏ వీధిలోనో ఎదురు పడినప్పుడు, నలుగురూ చాటుగా నవ్వు కునేవారు. రాను రాను అతడి ముందే నవ్వడం ప్రారంభించారు. తన కొచ్చిన యీ చెడ్డ పేరు ఎలా పోగొట్టుకోవాలో అతడికి అర్థం కాలేదు.

భీమరాజుకు రామరాజు అనే స్నేహితు డున్నాడు. ఒకరోజున అతడు స్నేహి తుడితో తనకెదురైన సమస్య గురించి చెప్పుకున్నాడు.

''అందరూ నిన్ను భార్యావిధేయుడన టానికి కారణం, నువ్వామె మాటకు ఎదురుచెప్పలేక పోవడం. ఈసారి నీ భార్య చెప్పిన మాట వినకు. ఏం జరుగు తుందో చూద్దాం,'' అన్నాడు రామరాజు.

భీమరాజు కొంచెంసేపు ఆలోచించాడు తన మాట వినకపోతే భార్య పెద్ద గొడవ చేసి తీరుతుంది. దాన్ని భరించడం మరీ కష్టం!

ఈ మాటే భీమరాజు స్నేహితుడికి చెప్పాడు. రామరాజు చిన్నగా నవ్వి, ''చూశావా, నీకు తెలియకుండానే, నువ్వు భార్య మాటకు ఎదురు చెప్పలేని స్థితికి దిగజారిపోయావు. సరే, మరొక సలహా చెపుతాను; నీ మాట, నీ భార్య వినేలా చెయ్యగలవా ?'' అన్నాడు.

భీమరాజు మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. రామరాజు మొదట చెప్పినదానికన్నా యిది మరీ కష్టమైన పనిగా కనిపించింది. భార్య మాటకు ఎదురు చెప్పడం, లేదా ఆమె మాట విననట్టు ఊరుకోవడం, తన యిష్టాయిష్టాల మీద ఆధారపడి వుంటుంది. కాని, ఆమె తన మాట వినేలా చేయడం

బొమ్మిడి అచ్చారావు



తన చేతిలో లేదు. అది, ఆమె యిష్టా యిష్టాల మీద ఆధారపడుతుంది గదా!

స్నేహితుడి ఆలోచనా ధోరణి చూసి, యీసారి రామరాజు బిగ్గరగా నవ్వాడు.

"నే చెప్పిన రెండు సలహాల్లో ఏ ఒక్కటీ ఆచరణలో పెట్టలేవని తేలి పోయింది. మరి, నీ కొచ్చిన అపవాదు పోవడం ఎంత కష్టమో అర్థమయిందా?" అన్నాడు రామరాజు.

భీమరాజు దిగులుగా ముఖం పెట్టి, "అయితే, యింకో ఉపాయం లేదంటావా?" అన్నాడు.

రామరాజు ఒకటి, రెండు క్షణాలు ఆలోచించి, "ఒక పని చేద్దాం. మా ఇంట్లో ఏదో శుభకార్యమని చెప్పి, మీ యిద్దర్నీ భోజనాలకు ఆహ్వానిస్తాను. నీ భార్య మనస్తత్వం ఎలాంటిదో ఒకసారి గమనించాలి," అన్నాడు.

ఆ తర్వాత నాలుగు రోజులకు రామరాజు, భీమరాజు ఇంటికి వచ్చి, తమ ఇంట శుభకార్యం అని చెప్పి, భోజనాలకు భీమరాజు దంపతులను ఆహ్వానించాడు.

సంగతేమంటే, భీమరాజు భార్య కాంతమ్మ స్వతహాగా గయ్యాళి కాదు. సాటి స్త్రీలలో తనకేదో ఆధిక్యత వున్న దనిపించుకోవాలనే తత్వం ఆమెది. అదృష్టమంటే కాంతమ్మదే! భర్త ఆమె మాట జవదాటడు—అని నలుగురాడ వాళ్ళూ చెప్పుకోవడం, ఆమె కెంతో సంతోషం కలిగిస్తుంది.

భీమరాజు భార్యతో, రామరాజు ఇంటికి వెళ్ళాడు. విందు భోజనం తయారుగా వుంది. రామరాజు ఆ యిద్దర్నీ ఆప్యాయంగా ఆహ్వానిస్తూ, "అప్పట్లో శుభ కార్యం అన్నాను తప్ప, అసలు సంగతి చెప్పలేదు. మాకు వివాహం అయి పదేళ్ళు ముగిసిన సందర్భంగా, యీ చిన్న విందు ఏర్పాటు చేశాను," అన్నాడు.

విందు జరుగుతున్నంతసేపూ రామరాజు భార్యను కోప్పడుతూనే వున్నాడు.

ఇందులో ఉప్పు తక్కువ; అందులో కారం ఎక్కువ అంటూ పెద్దగా కేకలు పెట్టాడు. అయినా, అతడి భార్య ఎంతో వినయంగా పొరపాటు జరిగిపోయిందంటూ క్షమాపణ చెప్పుకునే ధోరణిలో జవాబు లిచ్చింది.

ఇదంతా చూస్తూంటే కాంతమ్మకు ఒంటి మీద తేళ్ళూ, జెర్రులూ పాకుతున్నట్టనిపించింది. ఆమె దృష్టికి రామరాజు భార్యపట్ల పరమకిరాతకుడిలా కనిపించాడు.

విందు ముగిశాక కాంతమ్మ, రామరాజు భార్యను పక్కకు తీసుకుపోయి, "మీవారు ప్రతి స్వల్పానికీ అలా కోపం తెచ్చుకుని తిడుతూ వుంటే, మీరు గంగిరెద్దులా తల వూపుతూ వూరుకోవడం ఏం బాగా లేదు. నేనైతేనా!" అన్నది గట్టిగా చేతులు ఊపుతూ.

రామరాజు భార్య చిరునవ్వు నవ్వి, "చూడండి, కాంతమ్మగారూ! సంసారంలో భర్త భార్య కష్టసుఖాల్లో పాలు పంచుకుంటాడు. ఆమెకెన్నో విధాల బాసటగా నిలుస్తాడు. అటువంటి భర్తను గౌరవంగా చూసుకోవడం భార్య విధి. తన మాట విని తీరాలని మంకుపట్టు పట్టడం; వినలేదని భర్తను శాసించడం తప్పు! మా వారు నన్నిప్పుడు కోప్పడినా, తరవాత తన తొందరపాటుకు బాధపడతారు. ఆ సంగతి నాకు అనుభవపూర్వకంగా తెలుసు," అన్నది.



కాంతమ్మ ఆలోచనలో పడింది. రామరాజు భార్య మాటలు ఆమెకు చాలా సబబుగా కనిపించినై.

భీమరాజు ఇంటికి తిరిగి వస్తూనే, "ఛీ, రామరాజు యింత మూర్ఖుడూ, రాక్షసుడూ అనుకోలేదు. భార్యను అలా చీదరించుకుంటూ మాట్లాడడమేమిటి ?" అన్నాడు రుసరుసలాడుతూ.

భర్త మాటలకు కాంతమ్మ కోపంగా, "ఒక మాటడుగుతాను! మీరు, నేను చెప్పిన దానికెల్లా గంగిరెద్దులా తలూపక పోతే, రామరాజులా కాస్త పౌరుషంగా ప్రవర్తించలేరూ ?" అన్నది.

భీమరాజు ఉలిక్కిపడి, "నాకలాంటి ప్రవర్తనంటే యిష్టముండదు. నలుగురూ నన్ను భార్యా విధేయుడనుకోనీ, పోయిందేమిటి! నా మాట వినాలని మాత్రం నిన్ను శాసించను," అన్నాడు.

కాంతమ్మ వినయంగా, "ఇక మీదట అదేం కుదరదు. మీరు నలుగురి మధ్యా రామరాజులా ఠీవిగా తిరగాలి. భర్తను గౌరవించడంలో అతడి భార్యకు నేనేం తీసిపోను!" అన్నది.

భార్యలో కలిగిన మార్పుకు భీమరాజు చాలా సంతోషించాడు. తనను భార్యా విధేయుడని హేళనగా చూసే పదిమందికీ యీ సంగతి తెలియడం అవసరం! వారం రోజుల తరవాత అతడు తన పుట్టినరోజు పండగ అంటూ ఎరిగిన వాళ్ళను విందుకు ఆహ్వానించాడు. భీమరాజు భార్యకెంత విధేయుడో స్వయంగా చూసి ఆనందిద్దామని చాలా మంది వచ్చారు.

కాని, అలాంటి వాళ్ళకందరికీ పెద్ద ఆశాభంగమైంది. విందు సమయంలో భీమరాజు కొంత కావాలనే భార్యను చీటికీ, మాటికీ గట్టిగా కోప్పడ్డాడు. ఆమె ఎంతో వినయంగా ప్రవర్తించింది.

మర్నాడు భీమరాజు, తన స్నేహితుడు రామరాజును చూడబోయి, తన భార్యలో వచ్చిన మార్పుకు అతడికి కృతజ్ఞత చెప్పుకున్నాడు.



# డొంకతిరుగుడు

ఒక గ్రామంలో రామయ్య అనే సంపన్నగృహస్థు వుండేవాడు. ఆయన మంచితనం, తెలివితేటల్ని గురించి అందరూ గొప్పగా చెప్పుకునేవారు. ఎదటివాడు చెప్పే ఎంత చిన్న అబద్ధాన్నయినా, ఆయన చమత్కారంగా మాట్లాడి, డొంకతిరుగుడు ప్రశ్నలు వేసీ యిట్టే గ్రహించగలిగేవాడు.

రామయ్యకు పెళ్ళీడు కొచ్చిన కూతురున్నది. మంచి ఆస్తిపరుడు గనక ఆయనతో వియ్యమందాలని చాలామంది వచ్చి, తమకున్న ఆస్తిపాస్తుల విషయమై చిలవలూ, పలవలూ అల్లి ఘనంగా చెప్పుకునేవారు. రామయ్య అలాంటివాళ్ళను ఒకటి, రెండు ప్రశ్నలడిగి, నిజం తెలుసుకుని, మర్యాదగా పంపించివేసేవాడు.

ఒకసారి సుబ్బారాయుడనే దూరగ్రామం అతను రామయ్య దగ్గిరకు వచ్చి, "నా కొడుకు అన్ని విధాలా, మీ అమ్మాయికి తగినవాడు. ఇక ఆస్తి సంగతంటారా—మీరు మరోలా అనుకోకండి—మీ కన్న ఒక మెట్టు పైవాడినే!" అన్నాడు.

రామయ్య చాలా తాపీగా, "మీరూ మరోలా అనుకోకండి; ఒక చిన్న ప్రశ్న. మీ ఇంట్లో ఎలుకలూ, పిల్లులూ, కుక్కలూ—ఈ మూడూ వున్నాయా?" అన్నాడు.

సుబ్బారాయుడు చిరాకుపడుతూ, "అలాంటివి, మా ఇంట్లో లేవు," అన్నాడు.

"ఈ సంబంధం మా కిష్టం లేదు," అన్నాడు రామయ్య.

సుబ్బారాయుడు వెళ్ళిపోయాక రామయ్య భార్య భర్తతో, "పెళ్ళి మాటల్లో ఈ ఎలుకలా, పిల్లులా, కుక్కల సంగతెందుకు?" అన్నది.

"ధాన్యమున్నచోట ఎలుకలూ, పాడిపశువులున్నచోట పిల్లులూ వుంటాయి. ఆస్తిపరుడైన వాడు తప్పకుండా కాపలా కుక్కల్ని పెంచుకుంటాడు. ఈ వచ్చినాయన ఇంట ఈ మూడూ లేవు. దాన్నిబట్టి తెలియడం లేదా, ఆయనకున్న ఆస్తిపాస్తులేపాటో!" అన్నాడు రామయ్య.

—మహబూబ్ బాషా





# కాలకేతుడి గర్వం

ఒకప్పుడు కాంచనపుర రాజ్యాన్ని కాలకేతు అనే రాజు పాలిస్తూ ఉండేవాడు. కాలకేతు మహా గర్వి. తనే సర్వశక్తుడననీ, తనను పుట్టించిన బ్రహ్మ కూడా తన జోలికి రాలేడనీ ఒక విధమైన దురహంకారం అతన్ని పట్టి పీడిస్తూండేది.

'ఈ నడమంతరపుసిరి నిలిచేదికాదు. ఇది చూసుకుని మిట్టిపడబోకు!' అంటూ అతని క్షేమం కోరినవాళ్ళు చిలకకు చెప్పినట్టు చెబుతూ వచ్చారు. అధికార గర్వంతో వున్న కాలకేతుకు ఇటువంటి మంచి మాటలేవీ చెవికి ఎక్కేవి కావు. చిన్నా, పెద్దా తారతమ్యం లేకుండా, అందరనూ తృణీకరించేవాడు. రాజపదవి నుండి తనను తప్పించటానికి ఎవ్వరికీ తరం కాదని అతని ధీమా. ఈ ధీమా వల్లనే అతనిలో చెప్పలేని అహంకారం చెలరేగుతూ వచ్చింది.

కాంచనపుర రాజ్యపు ముఖ్య నగరంలో ప్రసిద్ధిగాంచిన ఒక దేవాలయమున్నది. ఆ దేవాలయంలో ప్రతి ఏటా అతి వైభవంగా గొప్పగొప్ప ఉత్సవాలూ, సమారాధనలూ జరుగుతూ వుంటవి.

తను సింహాసనం అధిష్ఠించిన తరువాత కాలకేతు తొలిసారిగా ఆ దేవాలయంలో ఉత్సవం చూడటానికని మంత్రి సామంతులతో, వందిమాగధులతో, సమస్తమైన పరివారంతో బయల్దేరాడు.

రాజు చేరుకొనేసరికి ఆలయంలో పండితులు పురాణాలు చదువుతున్నారు. పురోహితులు స్వరయుక్తంగా శ్లోకాలు చదువుతూండగా అతడు వచ్చి గుడిలో ప్రవేశించాడు.

అందులోని ఒక శ్లోకానికి అర్థం యిది: ఈశ్వరా! నీవు సర్వశక్తిమంతుడవు. సంకల్పమాత్రం చేతనే ప్రభువును

సేవకునిగాను, సేవకుని ప్రభువుగానూ చేయగలవు!

ఈ శ్లోకం చదువుతూ వుండగా కాల కేతుకి ఒంటి మీద తేళ్లూ జెర్రులూ పాకు తున్నట్టయింది. శ్లోకమంతా విన్న తరు వాత అతడు, సహజసిద్ధమైన తన అహం కారంతో, "దేవుడు సంకల్పిస్తాడట! తలుచుకుంటే, రాజును సేవకునిగా, సేవకుని రాజుగా మారుస్తాడట! వెర్రి బాగుల పండితులు! ఇవన్నీ ఏమాత్రం అర్థం లేని పిచ్చి శ్లోకాలు!" అనుకొ న్నాడు మనసులో.



అలా మథనపడుతూ వుండగానే, ఏదో తెలియని మైకం పట్టి కాలకేతును వశపరుచుకుంది. ఆవులించి, కన్నులు మూశాడు. ఆ మత్తు నుండి మెలకువ వచ్చి లేచేసరికి, చుట్టూ చీకటిమయంగా వున్నది! తనతో వచ్చిన మంత్రి సామం తులు లేరు, వందిమాగధులు లేరు, పరి వారం లేదు. మినుకుమినుకుమనే దీప కాంతి ఐనా సమీపంలో ఎక్కడా కనిపించలేదు.

కాలకేతుకు కంగారు పుట్టింది. ఒళ్ళంతా ముచ్చెమటలు పోసినై. గొంతు ఆర్చుకుపోయింది. ఆ చీకటిలోనే తడుముకొంటూ పోయి, ఎలాగో తలుపు ఉండే తావు తెలుసుకున్నాడు. దబదబా తలుపులు బాదుతూ, "తలుపు తీయండి. నేను రాజును, కాలకేతు మహా రాజును! తలుపు తెరవండి!" అంటూ, గుడి ప్రతిధ్వనించేలాగ గొంతు చించుకు అరిచాడు.

ఈ కేకలు ఆలయం లోపలి నుంచి వస్తున్నవి. దేవాలయం అవతల కాపలా వాళ్ళున్నారు. వాళ్లకు ఈ కేకలు వినబడ గానే ఆశ్చర్యపడి, "ఇప్పుడేకదా ప్రభువు వారు పూజా పునస్కారాలు ముగించు కుని వెళ్లిపోయారు? వారు వెళ్ళడం కళ్ళారా చూశామే? ఇదేమిటి, నేను రాజును, నేను కాలకేతు మహారాజును! అని కేక వేస్తున్నాడే, వీడెవడన్నా పిచ్చి



"బంధించండి, పిచ్చివాడు! వీడు రాజభవనంలోకి ఎలా రాగలిగాడు!" అంటూ సేనానాయకుడు భటులను ఆజ్ఞాపించాడు. మరుక్షణంలో కాలకేతు చేతులకు సంకెళ్ళు తగిలించి, రాజు ఎదుట నిలబెట్టారు.

కాలకేతు రూపంలో వున్న దేవదూత రాజును చూస్తూనే మందహాసం చేశాడు. "ఎవరు నీవు?" అని ప్రశ్నించాడు.

"నేనా, నేనా!" అంటూ కాలకేతు హుంకరించాడు. క్షణం ఆగి, "నేను, కాలకేతు మహారాజును. తెలిసిందా?" అని బదులు చెబుతూ, భటుల వైపు తిరిగి, "వీడు మోసకారి. నా వేషం వేసుకు వచ్చాడు. వీడిని బంధించండి!" అని ఎలుగెత్తి అరిచాడు.

మారువేషంతో వచ్చిన దేవదూతకు కాలకేతులో అతిశయిస్తున్న అహంకారం నవ్వు పుట్టించింది.

"వీడెవడో తాగుబోతు. అయినా తెలివి తప్పకుండానే మాటాడుతున్నాడు. మన ఆస్థానంలో హాస్యగాడుగా ఐనా పనికి రావచ్చు. నిషా దిగేవరకూ ఖైదులో పెట్టి వుంచండి," అన్నాడు దేవదూత.

వెంటనే భటులు అతనిని తీసుకుపోయి ఒక చీకటి కొట్టులో బంధించారు. ఒక వంక అతడు, "నేను ఎవరను

వాడా, తాగుబోతా?" అని వాళ్ళలో వాళ్ళు వాదించుకోసాగారు.

ఎలా ఐతేనేం, కావలివాడు తటపటాయిస్తూనే తలుపు తెరిచేటంతలో, మెరపులాగా ఎవరో వ్యక్తి ఆ చీకటిలోకి దూసుకుపోవటం గమనించాడు. ఐనా, మనకెందుకనుకొని వాడు చల్లగా ఊరుకొన్నాడు.

ఇలా పరిగెత్తిన కాలకేతు క్షణంలో రాజభవనం చేరుకొన్నాడు. "ఎవరక్కడ? మేము దేవాలయంలో నిద్రిస్తూ వుండగా, మా అనుజ్ఞ తీసుకోకుండా ఈ మంత్రి సామంతులూ, వందిమాగధులూ ఎలా వదిలి వచ్చేశారు? వాళ్లను బంధించండి!" అని పరివారాన్ని ఆజ్ఞాపించాడు.

కొన్నారో. మహారాజును! కాలకేతును!'' అంటూ అరిచే అరపులను ఎవ్వరూ లెక్క చేయక, పిచ్చివానిని చూసి నవ్వినట్టు పకపక నవ్వి, హేళన చేయసాగారు.

మరికొద్ది రోజులకు దేవదూత, రాజ భవనంలో ఒక బ్రహ్మాండమైన విందు ఏర్పాటు చేశాడు. ఆ విందుకు దేశదేశాల నుండి సామంత రాజులందరూ వచ్చారు. దర్బారు కళ కళలాడుతూ వుంది.

మహామహులందరూ సమావేశమై ఉండగా ఖైదులో వున్న కాలకేతుని తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు, దేవదూత. ఆ ప్రకారం కాలకేతును తీసుకువచ్చారు.

రంగు రంగుల గుడ్డ పేలికలతో కుట్టిన దుస్తులు అతడు ధరించాడు. నెత్తిమీద హాస్యగాడు పెట్టుకునే కుచ్చుటోపీ. చేతిలో ఒక బారెడు పొడుగు గల వంకర టింకర కర్ర. భుజంమీద కిచకిచలాడుతూ వున్న కోతిపిల్ల ఒకటి!

ఆ వచ్చిన రాజాధిరాజు లందరకూ వానిని చూపిస్తూ దేవదూత, ''ఇతడెవరో మీకు తెలుసా?'' అని అడిగాడు.

ఈ మాటకు కాలకేతు పళ్లు పట పట కొరుకుతూ, ''నన్ను గుర్తించ లేరా? నేను అసలు కాలకేతు మహా రాజును. వీడెవడో నా వేషం వేసుకువచ్చి మాయనాటకం ఆడుతున్నాడు!'' అని వారందరినీ ప్రశ్నించాడు.

వారంతా పొట్ట చెక్కలయ్యేలా నవ్వి ''వీడెవడో, కొంచెం తలబిరుసు వాడు.



క్షాని తెలివైనవాడే! బలే హాస్యగాడు!'' అంటూ కాలకేతు కేసి చూచి వేళాకోళం చేశారు. కాలకేతు ఉస్సూరుమన్నాడు.

ఇలా వుండగా, ఒక రోజున రాజు రూపంలో ఉన్న దేవదూత కాలకేతును అంతఃపుర్రంలోకి పిలిపించాడు.

''నువ్వెవరవు? ఇప్పుడైనా సరిగా చెబుతావా?'' అని అడిగాడు. ఈ ప్రశ్న వింటూనే కాలకేతు కుప్పగా కూలిపోయాడు.

కొంత సేపటికి తేరుకుని, తెలివిలో పడి, ''నేనా మహారాజా! నేను పిచ్చివాణ్ణి. మానవబలాన్నీ, దైవబలాన్నీ కూడా ధిక్కరించిన మహాగర్విని. అహంకార పూరితుణ్ణి. బుద్ధిహీనుణ్ణి. దైవబలం లేక. నా ప్రజలే నన్ను గుర్తించలేక పోయారని యిప్పుడు తెలుసుకున్నాను. కళ్ళు తెరిచాను. నా గర్వం అణిగింది. అహంకారం నశించింది. దీనుణ్ణి. ప్రజలకు దాసుణ్ణి.'' అని ఆవేశంతో కాలకేతు భోరున ఏడవసాగాడు.

అప్పుడు దేవదూత తృప్తితో తలవూపి, రెండు చేతులూ ఎత్తి దీవిస్తూ, ''నీలో గర్వం, అహంకారం నశించినై. నిజంగా ఇప్పుడు నీవు రాజువి. మహారాజువి. కాలకేతువి!'' అన్నాడు.

మరుక్షణంలో చూద్దామంటే దేవదూత మరి కనిపించలేదు. కాలకేతు ధరించిన రంగు పేలికలన్నీ రాజోచితమైన దుస్తులుగా మారిపోయినై. నెత్తిమీది కుచ్చుటోపీ నలువైపులా కాంతులు వెదజల్లే నవరత్న ఖచితమైన కిరీటంగా తయారైంది!

కొద్ది రోజుల తరవాత మళ్ళీ కాలకేతు ఆ దేవాలయంలో ఇంకా గొప్పగా ఉత్సవాలు ఏర్పాటు చేశాడు. ఈసారి పురోహితులు వల్లించిన శ్లోకాలు మహారాజుకు ఆనందాన్ని కలిగించినయే కానీ వెగటు కాలేదు. ఈసారి ఈశ్వరశక్తికీ, జనవాక్యానికీ వినయుడై అతడు జేజేలు పలికాడు! నాటినుండీ కాలకేతు ప్రజలందరకూ ఇష్టుడైనాడు.






# కోశాధికారి

అమరపుర రాజ్యాన్ని పరిపాలించే విజయ సేనుడు, కోశాధికారి పదవి కూడా తానే స్వయంగా నిర్వహించేవాడు. రాజే, కోశాధికారి పని కూడా చూసుకునే యీ వింత సంప్రదాయం, అతని తండ్రి కాలంలో ప్రారంభమైంది. ఆయన దగ్గిర కోశాధికారిగా వున్న ఒకడు నమ్మకద్రోహం చేసి, కోశాగారాన్ని కొల్లగొట్టాడు.

విజయసేనుడికి రాను రాను పరిపాలనకు సంబంధించిన బాధ్యతలు పెరిగి పోవడంతో, ఎవరైనా నమ్మకస్థుడొకణ్ణి కోశాధికారిగా నియమించడం అవసరం అనుకున్నాడు.

ఒకనాడు రాజు, మంత్రి సుగుణగుప్తుడితో, "నాకు బాధ్యతలు మరీ మితిమీరి పోవడంతో, కోశాగారానికి సంబంధించిన లెక్కల పూర్తి వివరాలు మర్నాటికి వాయిదా పడిపోతున్నవి. ఎవరైనా నమ్మకస్థుణ్ణీ, సమర్థుణ్ణీ కోశాధిపతిగా నియమించ దలిచాను; మీ సలహా ఏమిటి?" అన్నాడు.

రాజు నిర్ణయానికి మంత్రి చాలా సంతోషించి, "కోశాగారం లెక్కలు ఏ రోజు కారోజు సక్రమంగా తేల్చి చెప్పగలవాణ్ణి నియమించడం బాగానేవుంటుంది. కాని, యిక్కడ మనం, మీ తండ్రిగారి అనుభవాన్ని గుర్తుంచుకోవాలి! ఆ పదవిని మంచి నిజాయితీ పరుడికి ఒప్పచెప్పాలి," అన్నాడు.

"నేను అనుకున్నదీ అదే! ఎవరో తెలియనివాడికి ఆ ఉద్యోగం యివ్వడం కన్న, రాజభవనంలో పనిచేస్తున్న వాళ్ళల్లో ఎవరికైనా, ఆ పదవి ఇవ్వడం మంచిది," అన్నాడు రాజు.

మంత్రి అందుకు సరేనని, కోశాధికారి పదవిని గురించి ఒక ప్రకటన తయారు

రాంబాబు

చేసి, రాజోద్యోగులందరికీ పంపాడు. దాన్ని చూసిన ఉద్యోగుల్లో యించుమించు అందరూ, కోశాధికారి పదవి కోసం దరఖాస్తులు పంపుకున్నారు. మంత్రి వాటిని తీసుకుని రాజు వద్దకు వెళ్ళాడు.

రాజు వాటిని చదివి చూసి, అనంత శర్మ అనే అతనికి మిగతా వాళ్ళకన్న అనుభవం, యోగ్యతా వుండడం గమనించి, మంత్రితో, "ఈ అనంతశర్మ కోశాధికారిగా పనికి వచ్చేలా వున్నాడు," అన్నాడు.

"మహారాజా కోశాధికారి పదవికోసం దరఖాస్తులు పెట్టిన వారిలో, ఏ ఒక్కర్నీ మనమా పదవిలో నియమించడం క్షేమం కాదు. వీళ్ళందరూ ఆ పదవిని తమ స్వలాభానికి ఉపయోగించుకోవాలని చూస్తున్నారు. రాజభవనంలోని ఉద్యోగులందరూ ధరఖాస్తులు పంపారు గాని, వాళ్ళల్లో ఒక్క జ్ఞానవర్మ మాత్రం పంపలేదు, ఆతడు చాలా నిజాయితీ పరుడని నాకు నమ్మకం కలిగింది. కోశాధికారిగా అతణ్ణి నియమించండి," అన్నాడు మంత్రి.

రాజు, మంత్రి మాటలకు ఆశ్చర్యపడి, "అలాంటప్పుడు, యీ దరఖాస్తు తతంగమంతా ఎందుకు నడిపినట్టు?" అని అడిగాడు.

"మహారాజా, రాజోద్యోగులకు నేను పంపిన ప్రకటనలో, కోశాధికారి పదవికి ప్రస్తుతం వాళ్ళు తీసుకుంటున్న వేతనం కన్న, తక్కువ వేతనం యివ్వబడుతుందని తెలియబరిచాను. అయినా, యిందరు ఆ పదవి కోసం ఎగబడుతున్నారంటే, వాళ్ళ దురుద్దేశం తెలుస్తూనే వున్నది! ఒక్క జ్ఞానవర్మ అనే అతను మాత్రమే, దరఖాస్తు పంపలేదు," అన్నాడు మంత్రి.

మంత్రి సూక్ష్మబుద్ధిని రాజు చాలా మెచ్చుకున్నాడు. ఆయన మర్నాడు జ్ఞానవర్మను పిలిపించి, మంత్రి ప్రకటనలో చెప్పినట్టు కాక, అతణ్ణి నెలకు వెయ్యి వరహాల వేతనం మీద కోశాధికారిగా నియమించాడు.





# విఘ్నేశ్వరుడు

వాతాపినగర మధ్యంలో ఉన్న మహాశిల విఘ్నేశ్వర శిల్పంగా రూపొందాలనే కోరిక అగస్త్యుడికి మిగిలిపోయింది. లోపాముద్ర చిత్రకళా ప్రవీణురాలు. ఆమె అక్కడకు వచ్చి మహాశిలను పరిశీలించి, అది ఏ విధంగా రూపొందాలో అలాంటి విఘ్నేశ్వరుని రూపరేఖా చిత్తరువును తయారుచేసింది.

రేఖాచిత్రమైతే తయారైంది గాని, ఆ ప్రకారంగా మహాశిలను మలచగల శిల్పులు, శిల్పాచార్యుడు ఎంత ప్రయత్నించినా లభించలేదు. అగస్త్యుడు చింతాక్రాంతుడై మహాశిల ఎదురుగా కూర్చొని, చిత్రపటాన్నీ, శిలనూ పదేపదే చూసుకుంటూ కాలం గడుపుతున్నాడు.

వచ్చిన శిల్పాచార్యులందరూ చిత్రం చూసి, "ఇలాంటి శిల్పం మలచటం దేవశిల్పి విశ్వకర్మకో, దానవశిల్పి మయుడికో తప్ప ఇతరులకు సాధ్యం కాదు!" అంటూ వెనక్కు జంకారు.

శిల్పులు ఉలులను మహాశిల మీద పరీక్షించి, "ఇది వజ్రపాషాణం. దీన్ని చెక్కడానికి మామూలు ఉలి పనికేరాదు, వజ్రపు ఉలులుండాలి. దేవతలో, యక్షులో వచ్చి చెక్కవలసిందే కాని, మానవమాత్రుల తరంకాదు!" అంటూ చెప్పారు.

ఆ సమయంలో దేవశిల్పి విశ్వకర్మ భార్య విష్ణుమానస పుత్రిక విశ్వకళ అలిగి పుట్టింటికి వెళ్ళి వున్నది. విశ్వకర్మ మతి



స్థిరం పోగొట్టుకున్నాడు. దానవశిల్పి మయుడు అతని అప్సర భార్య హేమ తిరిగి దేవలోకానికి వెళ్ళిపోగా, పిచ్చివాడై జాడలేకుండా ఎక్కడో తిరుగుతున్నాడు. విశ్వకర్మనో, మయుణ్ణో పిలుద్దామన్నా వారి స్థితి అంత అధ్వాన్నంగా ఉంది.

అగస్త్యుడికి మహాశిలను విఘ్నేశ్వర విగ్రహంగా రూపొందించడం సమస్యగా నిలిచిపోయింది. నిద్రాహారాలు మాని అతడు శిల కెదురుగా అలాగే దివారాత్రాలు కూర్చొని విఘ్నేశ్వరుణ్ణి ధ్యానిస్తూ, "గణపతీ! నా కోరిక కోరికగానే ఉంచేశావు. ఇక నీదే భారం!" అని స్మరణ చేస్తూ దిక్కులు చూస్తూ నిరీక్షించసాగాడు.

ఒకనాటి సంధ్యాసమయంలో దోరపు బొజ్జ ఊపుకొంటూ గుజ్జుగా ఉన్న ఒక బాలప్రాయంవాడు అటు వస్తున్నాడు. అతని చేతిలో ఏదో ఉలి లాంటిది పిడితో ధగధగా మెరుస్తున్నది. కండలు తేరి ఉన్నాడు, శిల్పి లాగ కనిపించాడు.

అగస్త్యుడు ఆశగా అతని చేత నున్న దాన్ని బాగా పరికించి చూడగా, అది ఏనుగుదంతం కొనముక్క పిడిలో బిగించి నట్టుగా తెలుసుకుని ఆశ్చర్యపోయాడు.

ఆ తరుణశిల్పి, అగస్త్యుణ్ణి సమీపించి, "ఏమిటో మహర్షులవారు మహాశిల ముందు మంతనాలాడుతూ కూర్చున్నారు; ఏమైనా పని దొరుకుతుందేమో నని యిలా తిరుగుతున్నాను!" అన్నాడు.

అతని మాటలు మధురంగా అగస్త్యుడికి పారవశ్యాన్ని కలిగించాయి.

"చిరంజీవీ! ఈ మహాశిలను గణపతి దేవుడి విగ్రహంగా చూడాలని ఎన్నో దినాలుగా ఉవ్విళ్ళూరుతున్నాను." అంటూ తన దగ్గిరున్న రేఖాచిత్రాన్ని శిల్పికి చూపించి, "ఇంతకూ నువ్వెవరు? ఏం పని చేస్తావు?" అని అడిగాడు.

"నేను చేసే పనుల్లో మొదటిది పుష్టిగా తినడం, తర్వాత శిల్పం చెక్కటం. నన్ను బాలశిల్పాచార్యుడు అని పిలుస్తూం టారు!" అని బాలశిల్పి చెప్పాడు.

అగస్త్యుడికి అతడి మాటలతీరు మేను పులకరించే నవ్వు పుట్టించాయి. ఆయన అతణ్ణి సందేహంగా చూస్తూ, "మహా శిలను మహాశిల్పంగా రూపొందించే మహా శిల్పి కోసం పడిగాపులుపడి ఉన్నాను. శిల్పి నంటున్నావు గాని, బాలశిల్పివి; శిల బ్రహ్మాండమైనదీ, మహోన్నతమైనదీను! నీవేమో పొట్టి వాడివి. అలాంటప్పుడు, మహాశిల్పాన్ని మలచగలవా అని ఏమని అడగ్గలను!" అన్నాడు నిట్టూరుస్తూ.




బాలశిల్పి నవ్వి, "బాలశిల్పి నైనంత మాత్రాన నా శిల్పం మహాశిల్పం కాదని అనుకోకు! మహా అని అన్నంతమాత్రాన గొప్పేమీ కాదు. మన ఉలికి సాధ్యంకానిదేదీ లేదు!" అంటూ ఉలిని తీసి చూపించాడు. అది ధగధగా వజ్రం లాగా మెరుపులు విరజిమ్ముతున్నది.

అగస్త్యుడు చూస్తూండగా బాలశిల్పి ధంతం ఉలిని మహాశిల మీదకి విసిరాడు. ఉలి మొన తాకిడితో పెద్ద మెరుపు, కాంతి, ఉరిమిన శబ్దమూ వెలువడ్డాయి. అక్కడ శిలకు ఒక రంధ్రం ఏర్పడింది.

"అది నాభిస్థానము. మూర్తి శిల్పానికి నాభిస్థానము చాలా ముఖ్యమైనది; అందునా లంబోదరుడి నాభి! లంబోదరంతో శిల్పం ప్రారంభమవుతున్నదన్న మాట!" అని బాలశిల్పి చెప్తూంటే, రాతి నుండి 'లంబోదర లక్ష్మీకరా....' అంటూ మాళవ రాగంలో సన్నగా పాట అగస్త్యుడికి వినిపించింది.

"ఇది అయస్కాంతరాయి! చెక్కుతున్నప్పుడు ప్రచండమైన విద్యుత్తు వెలువడుతుంది. గనక శిల్పం చెక్కడం పూర్తయ్యేవరకూ, ఈ చుట్టు పక్కల పిట్ట మనిషి ఉండకూడదు. గొప్ప ధ్వనులు కూడా వినిపిస్తాయి. నగరవాసులు భయపడి కంగారుపడ నవసరం లేదు. ఓ మహర్షీ, ఇక నీవు వెళ్ళవచ్చు. వెళ్ళి నిశ్చింతగా నిద్రతీయి. తెల్లవారు



ఝాముకి శిల్పం పూర్తవుతుంది!'' అని చెప్పాడు బాలశిల్పి.

అగస్త్యుడు ఆశ్చర్యపడ్డాడే గాని, అంతకు మించి మరేమీ అతనికి తోచ లేదు. అతని బుద్ధి ఏదో నిద్రలో పడ్డట్టుగా ఉంది! కొంచెం తేరుకొని అగస్త్యుడు రేఖా చిత్ర పటాన్ని తీసి బాలశిల్పికి యివ్వ బోతుంటే, ''ఇదివరకే చూపించావుగా, ఒక్కసారి చూస్తేచాలు. పదే పదే చూసు కుంటూ చెక్కేరకం మహాశిల్పిని కాను, శిల్పం ఒక ఆటలాగ చెక్కుకొనే కేవలం బాలశిల్పిని! అంతా అయ్యాక చిత్రం గీచిన వారిని వచ్చి చూసుకోమను, సరిగ్గా ఉందో లేదో! చిత్రానికి ఎంత యిచ్చావో ఏమో గాని, నా కేమాత్రం ప్రతిఫలం ముట్ట జెపుతావో చూడాలి!'' అని బాల శిల్పి అన్నాడు. చివరి మాటలు అగస్త్యుడికి దిగులు పుట్టించాయి.

తన భార్య లోపాముద్ర కోరికమేరకు తీసి ఉంచిన ధనం తప్పితే తన అధీనంలో యింకేమీ లేదు, అంతా పంచిపెట్టేశాడు. శిల్పికి పారితోషికంగా ఆ కొద్దిపాటి ధనమూ యిచ్చివేయక తప్పదు. లోపాముద్రకు ఏమని చెప్పడం? అలా అనుకుంటూ అగస్త్యుడు వెళ్ళేసరికి లోపాముద్ర ముఖం తేజోవంతంగా దీపంలాగ వెలిగిపోతున్నది. ఏమిటి సంగతి? అన్నట్లు భార్యవంక చూశాడు.

లోపాముద్ర పొంగిపొర్లే ఆనందంతో, ''అగస్త్యులవారు నన్ను మన్నించాలి! ఋషిపత్ని ఋషిపత్నిలాగే ఉండాలనీ, అదే ధర్మమనీ నాకు తొలుత నుండీ తెలిసినదే. నగలు, మంచి బట్టలు కావాలని, ధనం సేకరించుకు రమ్మని నేను ఎందుకన్నానో, నాకే ఆశ్చర్యంగా ఉంది ఇప్పుడు. ఏదో ఒక మహత్కార్యం నెరవేరడానికి అనిర్వచనీయమైన ఏదో శక్తి నా నోట ఆ మాటలు పలికించినట్లు తోస్తున్నది. నాకు ఏ ఆభరణాలూ వద్దు, ఏ పట్టుచీరలూ వద్దు, ఏ ధన సేకరణా వద్దు! నాలో తాత్కాలికంగా ప్రవేశించిన



అజ్ఞానం యిప్పుడిప్పుడే తొలగిపోయింది!'' అని అన్నది.

ఆమె మాటలకు అగస్త్యుడు లోలోపల సంతసించాడు.

''శిల్పి కుదిరాడు శిల్పం తయారౌతున్నట్లే, తెల్లవారేసరికి పూర్తి అవుతుందట!'' అన్నాడు ఋషి.

''ఏమిటేమిటీ! తెల్లారేసరికి ఆ మహాశిల, శిల్పం అవుతుందా? ఆ శిల్పి మానవుడా, దేవుడా?'' అన్నది లోపాముద్ర.

''మానవమాత్రుడే, బాలుడు కూడా. ప్రతిఫలం ఎలా యివ్వాలో, ఎంతివ్వాలో ఏమీ తోచకుండా ఉంది,'' అన్నాడు అగస్త్యుడు.

''నా నిమిత్తంగా తీసి ఉంచిన ధనం ఉందిగా, అది చాలదా?'' అన్నది లోపాముద్ర.

''సరే, తెల్లవారాక ఎదో ఒకలాగ సరిపెట్టవచ్చు,'' అన్నాడు అగస్త్యుడు.

''అన్నట్టు, రేపు భాద్రపద శుద్ధ చతుర్థి, వినాయకచవితి రోజు! శిల్పం ధ్యాసలోపడి మీరు నెలలు, తిథులు మరిచినట్లున్నారు,'' అన్నది లోపాముద్ర.

''ఏమిటీ! రేపు వినాయకచవితి, విఘ్నేశ్వర శిల్పం తయారవడం! చిత్రంగా ఉందే!'' అంటూ అగస్త్యుడు ఆశ్చర్య పడుతూంటే, లోపాముద్ర, ''ఆ శిల్పి బాలుడూ కాడు, మానవమాత్రుడూ కాడు!'' అన్నది.

భార్య మాటల్లో ఎదో అద్భుత సత్యం ఉందనిపించింది, అగస్త్యుడికి. చాలా రాత్రయింది, నిద్ర పట్టలేదు, కుతూహలం పెరిగింది, ఏం జరుగుతున్నదో చూడాలని అగస్త్యుడు బయలుదేరాడు.

అగస్త్యుడు మహాశిల సమీపాన్ని చేరేసరికి కనిపించిన దృశ్యానికి అతని ఒళ్లు జలదరించింది. అలాగే అక్కడ చతికిలబడిపోయాడు. కొన్ని వందల ఉలులు శిల్పాన్ని వాటంతట అవే చెక్కుతున్నవి. రంగు రంగుల విద్యుత్కాంతులు మిరుమిట్లు గొల్పుతున్నవి. ఖణఖణ ధ్వను



లతో హోరుమంటూ శబ్దం వెలువడుతున్నది. ఉలులన్నీ ఏనుగుదంతం కొనముక్కల్లాగ వజ్రాల్లా మెరిసిపోతున్నవి. అది స్వప్నమో నిజమో తెలియని విభ్రాంతిలో మైకం కమ్మి, అగస్త్యుడు అలాగే సొమ్మసిల్లి నిద్రలో పడిపోయాడు.

అలా నిద్రపోయిన ఋషి కళ్ళు తెరిచే సరికి ఎదురుగా తట్టి లేపుతున్న బాలశిల్పి కనిపించాడు. తూర్పు తెల్లనవుతున్నది.

"ఏమిటి, మహర్షీ! ఇక్కడ ఇలా నిద్రిస్తూ కలగంటున్నావు? యోగవిద్యాపారంగతుడవైన నీకు యీ కలల నిద్ర ఏమిటి! శిల్పం పూర్తయింది. చిత్రం గీచిన వారిని వచ్చి చూసుకోమను; చిత్రించినదంతా సరిగ్గా శిల్ప రూపం పొందిందో లేదో!" అని బాలశిల్పి అంటూండగా, పళ్ళెరం నిండా కుడుములూ, జలమూ, పూలు పట్టుకొని లోపాముద్ర వచ్చింది.

అగస్త్యుడు సంభ్రమాశ్చర్యాలతో స్ఫటికం లాగ మెరిసిపోతూన్న విఘ్నేశ్వర మహా శిల్పాన్ని చూస్తూండగా, బాలశిల్పి అతనితో, "నాకు ప్రతిఫలం ఏమిస్తావో యివ్వుమరి," అన్నాడు.

అగస్త్యుడు మాట తడబడుతూ, "మహా శిల్పీ! నీకు ఏమిచ్చినా చాలదు, అయినా చంద్రుడికో నూలుపోగన్నట్లు కొద్దిపాటి ధనం తీసి ఉంచాను, తెస్తాను!" అన్నాడు.

బాలశిల్పి, "సరే, ఇంతకూ రేఖా చిత్రరచన చేసినందుకు ఏమిచ్చావో అది చెప్పు ముందు? శిల్పం చెక్కడం శ్రమ మాత్రమేగాని గొప్పతనమంతా శిల్పాకృతికి మూలమైన రేఖాచిత్రానిదే. చిత్రణ ఊహాసంపన్నమైన మేధస్సుతో కూడిన కళ!" అన్నాడు.

"అయ్యా, బాలశిల్పాచార్యా! చిత్రించిన వారికి వేరే ఏమీ యివ్వనవసరం లేదు. ఆ చిత్రం తయారుచేసింది నా భార్యే!" అంటూ లోపాముద్రను చూపిస్తున్నట్లుగా ఆమె వంక చూశాడు

అగస్త్యుడు. లోపాముద్ర ఏదో తన్మయావస్థలో మునిగి ఉన్నది.

"ఏమి మాట మహర్షీ! నేనే అయితే ఒక మహానగరాన్ని నిర్మించడానికి సరిపడే ధనాన్ని చిత్రణకు యిచ్చి ఉందును, అంత గొప్ప రేఖాచిత్రమది. ఆ ధనం ఆ యమ్మకే చెందుతుంది!" అన్నాడు బాలశిల్పి.

అగస్త్యుడు, "అసలు ఆ ధనాన్ని ఆమె కోసమనే తీసి ఉంచాను!" అని నోరుజారి అన్నాడు.

బాలశిల్పి ఆశ్చర్యంగా, "ఏమిటీ! ఇంతకూ అది స్త్రీ ధన మన్నమాట! చెప్పావు గనక సరిపోయింది. నువ్విచ్చినా, నేను పుచ్చుకున్నా ఎంత అన్యాయం మూట గట్టుకొనే వారమో కదా! అందులోది చిల్లిగవ్వ కూడా నాకు అఖ్ఖరలేదు," అంటూ లోపాముద్ర వంక చూసి, "అమ్మా! నీ చేత్తో ఒక్క బిళ్ళ కుడుము నాకు పెట్టు, నా కదే చాలు! చెక్కేందానికి బొక్కేందే కూలి అని బ్రహ్మ శిల్పుల నుదుట ఎప్పుడో రాసి పెట్టేశాడు!" అని అన్నాడు.

ఆ మాటలు వినడంతోనే లోపాముద్ర కుడుముల పళ్ళెరాన్ని అతని ముందు పెట్టి, సాష్టాంగపడి బాలశిల్పి పాదాలు పట్టుకొని, "విఘ్నేశా! నీ అనుగ్రహంతో, మా జన్మలు తరించాయి!" అన్నది. బాలశిల్పి అదృశ్యమయ్యాడు.

అగస్త్యుణ్ణి ఆవరించిన మాయ విడిపోయింది. విఘ్నేశ్వర మహా శిల్పం ముందు ప్రణమిల్లి, "విఘ్నేశ్వరా! నేనెంతో గొప్ప యోగబలం గల వాడిననీ, తపశ్శాలిననీ గర్వపడుతూండే వాడిని. కాని, నీ ముందు వట్టి అజ్ఞానినై పోయాను. ఎంతటి వాడైనా, నీ మాయకు అతీతుడు కాడు!" అంటూ నమస్కారాలు చేస్తూ లెంప లేసుకుంటూంటే, శిల్పంలోని దేవతా విగ్రహాలన్నీ పాడుతూన్నట్లుగా, 'వాతాపి గణపతిం భజే హం!....' అనే కీర్తన హంసధ్వని రాగంలో మారుమ్రోగుతూ వినిపించింది.





# గంధర్వ చక్రవర్తి కూతురు

## 7

నిరాశతో ఇంటికి వెళ్లిన హసన్‌కు అంతలోనే మళ్ళీ కొత్త ఆశ చిగిర్చింది — అతనికి రాజకుమార్తెలు జ్ఞాపకం వచ్చారు. అతను తల్లికి మళ్ళీ వీడ్కోలు చెప్పి ఒంటెను పిలిచి దానిపై తన అక్కల వద్దకు బయలుదేరి వెళ్లాడు. అతను అంత త్వరగా తిరిగి వచ్చినందుకు వాళ్ళు పరమానందం చెందారు. అతను వారితో జరిగినదంతా చెప్పి శోకంతో వివశుడైపోయాడు. వారు అతన్ని ఊరడించారు.

"వాక్–వాక్ దీవులకు వెళ్లే మార్గం నాకు చెప్పండి. అక్కడ విచారిస్తే తన జాడ తెలుస్తుందని నా భార్య వెళ్ళిపోయేటప్పుడు చెప్పిందట," అన్నాడు హసన్.

ఏడుగురు అప్పచెల్లెళ్లూ ముఖముఖాలు చూసుకుని తలలు వంచుకున్నారు. చివరకు వారు, "హసన్, చెయ్యి ఎత్తి స్వర్గాన్ని తాకటమైనా నీకు సాధ్యమవుతుందేమో గాని, వాక్ - వాక్ దీవులకు వెళ్ళటం సాధ్యం కాదు," అన్నారు. హసన్ పెట్టుకున్న ఆశలన్నీ అడుగంటిపోయాయి. దుఃఖావేశం ముంచుకొచ్చింది.

అతన్ని పెంచుకున్న ఆఖరు రాజకుమార్తె ఊరడించి, "నీకు నీ భార్యాబిడ్డలూ దక్కే యోగం ఉంటే ఏదో ఒక ఉపాయం దొరకకపోదు. హసన్, మేము మాకు చేతనయినదంతా చేస్తాము గాని చేతులు కట్టుకు కూర్చోము, దిగులు పడకు," అని ధైర్యం చెప్పింది.

ఈ రాజకుమార్తెలకు అబ్దల్ కద్దూస్ అని ఒక మేనమామ ఉన్నాడు. ఆయన ఏడాదికొకసారి తన మేనగోడళ్లను చూడ



వస్తాడు. ఆయనను అవసరంపడి పిలవాలంటే ఒక రకమైన గుగ్గిలం నిప్పులో వెయ్యాలి. ఆ గుగ్గిలం పెద్ద రాజకుమార్తె వద్ద ఉన్నది. దానిని కొంచెం తీసి నిప్పుల మీద వెయ్యగానే పెద్ద సుడిగాలి వీచింది. అది అణగారి పోగానే తెల్ల ఏనుగు నెక్కి అబ్దల్ కద్దూస్ చక్కా వచ్చాడు.

"నేను వచ్చి ఏడాది అయింది. రేపు బయలుదేరి వద్దామనే అనుకుంటున్నాను. ఇంతలో మీరే పిలిపించారు. ఏదో విశేషం ఉండాలి, ఏమిటది?" అని ఆయన తన మేనగోడళ్ల నడిగాడు.

"మరేం లేదు. నీవల్ల మాకొక సహాయం కావాలి," అన్నారు రాజకుమార్తెలు.

"ఇచ్చేశాను! ఏమిటా సహాయం?" అన్నాడాయన. వారు ఆయనకు హసన్ కథ అంతా వివరంగా చెప్పి, "మా తమ్ముడు హసన్ వాక్-వాక్ దీవులకు వెళ్ళే మార్గం నువు చెప్పాలి," అన్నారు.

ఆయన మూతి మీద వేలు వేసుకుని, తల వంచి దీర్ఘాలోచన చేసి, ఏమేమిటో గుణించుకుని చివరకు, "లాభం లేదు. మీ తమ్ముడు అసాధ్యం తలపెట్టాడు. అతను వాక్-వాక్ దీవులు చేరటం అసంభవం," అనేశాడు.

"ఈ మాట అతని బుద్ధికి అంటేలాగు చెప్పు. నీ సలహా కూడా ఇయ్యి," అన్నారు రాజకుమార్తెలు.

అబ్దల్ కద్దూస్ హసన్‌తో, "నాయనా, తోకచుక్కలూ, సంచార గ్రహాలూ కూడా నిన్ను వాక్-వాక్ దీవులకు చేర్చలేవు. ఆ దీవులలో గంధర్వ చక్రవర్తి భద్రుడై ఉంటాడు. ఆ దీవులను సైనికకన్యల ముఠాలు కాపాడుతూ ఉంటాయి. సప్త సముద్రాలూ, సప్తనగాలూ దాటితేనేగాని ఆ దీవులను చేరలేవు. అక్కడికి వెళ్లటం నీకు అసాధ్యం. అందుచేత ఆ ప్రయత్నం మాని నీ అక్కలతో సుఖంగా కాలక్షేపం చేస్తూ ఇక్కడే ఉండిపో! లేనిపోని ప్రమాదాలెందుకు కొని తెచ్చుకుంటావు?" అని హితం చెప్పాడు.

ఈ మాటలు విని హసన్ ముఖం పాలిపోయింది. అతను పెద్ద పెట్టున కేక వేసి విరుచుకు పడిపోయాడు. అతన్ని చూసి అబ్దల్ కద్దూస్‌కు జాలికలిగింది. హసన్‌కు స్పృహ తెలియగానే ఆయన అతని భుజం మీద చెయ్యి వేసి, "నీ సంగతి ఇలా వదిలెయ్యటం నాకే బాగా లేదు. ఏదైనా దారి ఉందేమో చూస్తాం, నా వెంట వస్తావా?" అని అడిగాడు.

హసన్‌కు మళ్ళీ ప్రాణం వచ్చినట్ట యింది. అతను ఎగిరి గంతేసి ముసలాయ నను వెంబడించాడు. ఇద్దరూ తెల్ల ఏనుగు పైకెక్కి కూచున్నారు. కద్దూస్ దాని చెవిలో ఏదో చెప్పాడు. వెంటనే ఏనుగు గాలిలోకి లేచి, అద్భుత వేగంతో ప్రయా ణించి, నీలిపర్వతం చేరుకున్నది. నీలి పర్వతంలో ఒక గుహ, దానికి నీలం రంగుగల ఉక్కు తలుపూ ఉన్నాయి. వృద్ధుడీ తలుపు తట్టగానే నీలచ్ఛాయగల ఒక నీగ్రో, నీలి ఖడ్గమూ, నీలి డాలూ పట్టుకుని వచ్చాడు. వృద్ధుడు రెప్ప పాటులో వాడి కత్తి, డాలూ లాగేసి అవతల పారేశాడు. వెంటనే నీగ్రోవాడు వారికి దారి ఇచ్చాడు. ఇద్దరూ గుహలో ప్రవేశించినాక వాడు తలుపు మూశాడు.

గుహ మార్గంకుండా వారు ఒక మైలు దూరం నడిచాక రెండు వాకిళ్ళు కనిపిం




చాయి. రెంటికీ బంగారు తలుపు లున్నాయి. అబ్దల్ కద్దూస్ ఒక వాకిలి తలుపులు తోసి లోపలికి వెళ్ళిపోయాడు. ఆయన ఆదేశానుసారం హసన్ వెలపలనే ఉండిపోయాడు.

ఒక గంట గడిచాక ఆయన ఒక గుర్రాన్ని వెంట పెట్టుకుని బయటికి వచ్చాడు. గుర్రమూ, దాని జూలూ కూడా నీలంగానే ఉన్నాయి. ఆయన హసన్‌ను ఆ గుర్రం ఎక్కమని రెండవ ద్వారం తెరిచాడు. ఆ ద్వారం అవతల నీలాకాశం తప్ప మరేమీలేదు.

"నాయనా, ఆఖరుసారి ఆలోచించి నిర్ణయించుకో. నీకు ఘోర ప్రమాదాలు




ఎదురవుతాయి. వాటిని ఎదుర్కొంటావా? లేక మీ అక్కల దగ్గిరికి తిరిగి వెళ్ళిపోతావా?'' అని ఆయన హసన్‌ను అడిగాడు.

''వెయ్యి మరణాలనైనా ఎదుర్కొంటాను,'' అన్నాడు హసన్.

''కని పెంచిన మీ అమ్మకోసమైనా వెనక్కు తిరిగి వెళ్ళవా?'' అని వృద్ధుడు అడిగాడు.

''నా భార్యనూ, పిల్లలనూ వెంట తీసుకోకుండా మా అమ్మ వద్దకు తిరిగి వెళ్ళను,'' అన్నాడు హసన్.

''అలాగే కానీ, హసన్. ఈ ఉత్తరం తీసుకో. గుర్రాన్ని నీవు నడపనవసరం లేదు, దానికి దారి తెలుసు. అది నిన్ను నల్ల పర్వతం వద్ద దించుతుంది. నల్ల గుహవద్ద దిగి గుర్రాన్ని గుహలోకి వెళ్ళిపోనియ్యి. ఒక వృద్ధుడు బయటికి వస్తాడు. ఆయన నిలువుగా నల్లగా ఉంటాడు. కాని మోకాళ్ళదాకా పెరిగిన తెల్లటి గడ్డం ఉంటుంది. ఆయనకు వందనం చేసి ఈ ఉత్తరం ఇయ్యి. ఆయన పక్షులకు రాజు, నాకు పైవాడు. ఆయన సహాయం లేకుండా నీ పని సానుకూలం కావటం అసంభవం. ఆయన మెప్పు పొందు,'' అని అబ్దుల్ కద్దూస్ గుహ ప్రవేశించాడు. నీలం గుర్రం గట్టిగా సకిలించి ఆకాశంలోకి ఎగిరింది.

అబ్దుల్ కద్దూస్ ఇచ్చిన నీలిగుర్రం ఎక్కి హసన్ పగ్గాలు వదిలేశాడు. అప్పుడా గుర్రం బాణం లాగా సూటిగానూ, అతి వేగంగానూ ప్రయాణిస్తూ పది రోజుల కాలంలో పది సంవత్సరాల నడక ముగించి ఒక నల్లని పర్వత పంక్తిని చేరుకున్నది. ఆ పర్వత పంక్తి తూర్పు పడమరలుగా వ్యాపించి వున్నది. నీలిగుర్రం గట్టిగా సకిలించి పర్వతాల మీద దిగగానే ఎక్కడినుంచో నల్లని గుర్రాలు వేనకువేలుగా వచ్చి నీలిగుర్రాన్ని చుట్టుముట్టాయి. నీలిగుర్రం వాటి మధ్యగా వెళ్ళి ఒక నల్లని గుహను సమీపించింది.

గుహ వెలుపల హసన్‌ను దించి అది గుహలోకి వెళ్ళిపోయింది.

గుహ వెలుపల హసన్ ఒక గంటసేపు కాచుకున్నాక ఒక గౌరవనీయుడైన వృద్ధుడు గుహ నుంచి వెలికి వచ్చాడు. అతను కారునలుపుగా ఉండటమే గాక నల్లని దుస్తులు కూడా ధరించాడు. నడుము కిందికి వేళ్ళాడే ఆయన గడ్డం మటుకు తెల్లగా ఉన్నది. ఈయన సాక్షాత్తూ సులేమాన్ కొడుకైన అలీ. హసన్ ఆయన ముందు భక్తిగా మోకరించాడు. తరవాత ఆయనకు అబ్దల్ కద్దూస్. రాసిన ఉత్తరం అందించాడు. అలీ ఆ ఉత్తరాన్ని మౌనంగా తీసుకుని గుహలోకి వెళ్ళిపోయాడు.

ఎంతోసేపు గడిచింది. హసన్ నిరాశ చెందుతూండగా వృద్ధుడు తెల్ల దుస్తులు ధరించి గుహలో నుంచి వచ్చి, లోపలికి రమ్మని సైగచేసి, తనతోబాటు అతన్ని గుహ లోపల ఉన్న ఒక సావడిలోకి తీసుకువెళ్ళాడు. అది రత్నాలు పొదిగిన సావడి. దాని నాలుగు మూలలా తివాసీలపై నలుగురు జ్ఞానులు కూచుని ఉన్నారు. వారి పక్కన గ్రంథాలు దొంతరలు దొంతరలుగా పేర్చి ఉన్నాయి. సావడి మధ్య వృద్ధుడి శిష్యులు ఏడుగురున్నారు. వారు ఏమేమో రాస్తున్నారు.

అలీ రాగానే అందరూ లేచి, ఆయన సావడి మధ్య కూచోగానే అందరూ ఆయనను పరివేష్ఠించి కూచున్నారు. అప్పుడు హసన్ వారందరికీ తన కథ అంతా చెప్పాడు. తరవాత అందరూ చర్చించి హసన్‌కు సహాయం చెయ్యటమే ఉచితమని వృద్ధుడికి సలహా యిచ్చారు.

వారి సలహా విని ఆయన, "నిజమే కాని వాక్–వాక్ దీవులకు వెళ్ళటం తేలిక కాదు. తిరిగిరావటం మరింత కష్టం. యోధకన్యల నుంచి అతనికి రాగల అపాయం మాట చెప్పనే అవసరం లేదు. ఈ కుర్రవాడు తన భార్యను ఎలా కలుసుకోగలుగుతాడో నాకు అర్థం కావటంలేదు," అన్నాడు.

—(ఇంకా వుంది)



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1982 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.







Gopal Shroti — Prabu Sankar

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ ఏప్రిల్ నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి. (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి: — చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఎవరితో దాగుడుమూత ?

రెండవ ఫోటో : ఎగరలేని ఉడుకుమోతా !

పంపినవారు : ఎస్.వి. రవికిరణ్, కాకినాడ-533004

*బహుమతి మొత్తం రు. 25/—నెలాఖరులోగా పంపబడుతుంది.*

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

## చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

చుక్కలు వేసిన గీత వెంట కత్తిరించండి.

# చందమామ కేమెల్ రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు



**బహుమతులు గెలుచుకోండి**

కేమెల్—మొదటి బహుమతి రు. 15
కేమెల్—2వ బహుమతి రు. 10
కేమెల్—3వ బహుమతి రు. 5
కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు
కేమెల్—10 సర్టిఫికెట్లు

12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగులతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.

**P.B. No. 9928, COLABA, Bombay-400 005.**

ఫలితములు తుది నిశ్చయముగాన, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name ______________________ Age __________

Address ______________________________

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

బొమ్మను పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.

ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. *30—4—1982*

**CONTEST NO 24**

VISION

CHANDAMAMA (Telugu) APRIL 1982 Regd. No. M. 4854